# హెచ్చరిక

ఈ నాటకము యొక్క సర్వహక్కులు నేను పొందియున్నాను గావున నా పర్మిషన్ లేనిదే ప్రదర్శించుట, భాషాంతరీకరించుట, గ్రామఫోను రికార్డింగు చేయుట, రేడియోలో బ్రాడ్‌కాస్టు చేయుట, టాకీ స్క్రీనింగ్ చేయుట మొదలగు పనులు చేయకూడదు. ఇందులకు అతిక్రమించినయెడల నేను జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బద్ధులగుదురని యిందుమూలముగా తెలియపరచడమైనది.

ఇట్లు,

కాపీరైటు హక్కుదారుడు

**కురుకూరి సుబ్బారావు సన్**

ప్రొప్రయిటరు

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.**

రైల్వే బుక్‌స్టాల్సు : పవరుపేట, తాడేపల్లిగూడెం, నెల్లూరు.

# పాత్రలు

**పురుషులు :**

మార్కండేయుఁడు.
నారదుఁడు.
మృకండుఁడు.
శంకరుఁడు.
యముఁడు.
సుబంధుఁడు.
సుబంధు శిష్యుఁడు.
చిత్రగుప్తుఁడు.
మునిబాలుఁడు.
సేవకుఁడు.
ద్వారపాలకుఁడు.
1 వ శిష్యుఁడు.
2 వ శిష్యుఁడు.
1 వ కింకరుఁడు.
వ కింకరుఁడు.

**స్త్రీలు :**

మరుద్వతి.
మంజరి.
అరుంధతి.
పార్వతి.

# భక్తమార్కండేయ

## నాంది

చ॥ నను నిరతైకదృష్టి భజ♦నంబొనరించెడు భక్తకోటి నె
మ్మనమునఁ గోరుకోర్కెల స♦మగ్రముగా నొనగూర్తునన్న బా
సను నిలుపన్ మృకండుతను♦జాతుని జేకొనినట్టి శ్వేతశై
లనిలయుఁ డోము మిమ్ము సక♦లప్రథితప్రమదప్రదాయియై

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

## ప్రస్తావన

ఉ॥ పావన ముత్తరాజుకుల♦వార్ధిసోముఁడు సుబ్బరావు, గౌ
రీవరభక్తశేఖరు చ♦రిత్రము వ్రాసెను నాటకంబుగాఁ
గోవిదులార! దాని నిటఁ ♦ గూర్చి ప్రదర్శనముం బొనర్చుచో
నేవయనం దొసంగు లుద♦యించిన మమ్ము క్షమించి ప్రోచుఁడీ.

# భక్తమార్కండేయ

## ప్రథమాంకము



ప్రథమరంగము.

స్థలకము : బ్రహ్మలోకము

(నారద సహితుండై మృకండుండు విమానముదిగి ముందున కేగుచు)

మృకం—మిత్రమా! మనము గమ్యస్థానముం జేరితిమా?

నార—అవును.

చ॥ హితవర! యింతదాక మనమిర్వురముం దిలకించినట్టి లో
కతతులకంటె దుర్గమము గాఁ దనరారుచునుండు నీ సమీ
హితఫలదాయకంబు, సుజనేడ్యచరిత్రము, సర్వసేవ్య మా
యతమహిమాదివాస మగు నాదిజులోకము నింక గాంచుమా!

మృకం—ఆహా! ఇదియేనా బ్రహ్మలోకము! దీనిదర్శనంబున నాజన్మంబు ధన్యంబు. నా కామితంబులు కరతలామలకంబు లగు. ఇదంతయు నీ యనుగ్రహఫలంబుగదా!

ఉ॥ నీ కృపచేతఁగాదె నలినీభవసంభవ! నన్నుబోలు పా
పాకలితాంతరంగున కనంతవిషాదపరీతజీవి క
స్తోకతపోధనాఢ్యులకె చూడఁగ నియ్యెడ సాధ్యమైన యీ
లోకసముచ్చయంబును విలోకనఁజేసెడుభాగ్య మబ్బుటల్.

నార—మిత్రమా! ఇంతమాత్రమునకునన్నగ్గింపకుము. రమ్ము లోని కేగి పితామహుని సందర్శించి మనోరథసిద్ధిఁగాంతువుగాక!

మృకం—అట్లే కానిమ్ము!

(ద్వారము దాయ, ద్వారపాలకులు నారదునకు నమస్కరింప)

నార—ద్వారపాలకా! నేను మా తండ్రిగారిని దర్శింప నా మిత్రుని తోడి తెచ్చితిని. లోనికి రానీయవలయు.

ద్వార—ఆర్యా! మీ రెఱుఁగని దేదియు లేదు. అయిన నీ లోకం
బున కధర్మవంతులు అపుత్రకులు రాఁగూడదు. మీమిత్రుఁడు
పుత్ర వంతుఁడేకదా!

(మృకండుఁడు తలవాంచియుండ నారదుఁడు)

మ॥ అకటా! మిత్రమ! ఏమిసేయుదును, భా♦షాధీశులోకం బపు
త్రకుఁ డెవ్వండును జేరరా దనెడువా♦ర్తన్ మందబుద్ధిన్ స్మరిం
పకయే నిన్నిటు తోడితేర నిటులన్ ♦ భంగంబు వాటిల్లె; మా
మకదోషంబును మిత్రవత్సలతమై ♦ మన్నించి సైరింపుమా!

మృకం—మిత్రమా! క్షమింపవలసిన దేమున్నది? నా పురాకృత కర్మంబునకు నీవేమిచేయఁగలవు? గ్రామము క్రొత్తదైనఁ గర్మము క్రొత్తదగునా?

నార—మిత్రా! అట్లాడకుము. భక్తిచే జయింపరాని కర్మముండునా? నీవింక నింటి కేగుము. (దివ్యదృష్టి జూచి) నీవిల్లు చేరునప్పటికి నీకీ యపుత్రదుఃఖాబ్ధి దాఁటఁ దరణోపాయం బెఱుకపడఁ గలదు.

మృకం—మిత్రా! నీదయచే నట్టిది నాకలవడుఁగాక!

నార—అవశ్య మట్లే యగును. పోయి విమాన మెక్కుము. నేనును నాతండ్రిని దర్శించి విశేషములు గనుంగొని వచ్చెద.

[నారదుఁడు బ్రహ్మలోక మేఁగ యవనిక పడును]

మృకం—[ముందునకు వచ్చి]

ఉ॥ ఎన్నఁడు వచ్చు నారదము♦నీశ్వరుఁ డెన్నఁ డతండు మున్ను వా
కొన్నవిధాన బ్రహ్మకడ♦కుం గొనిపోయెడువాఁడో నన్నఁటం
చెన్నుచునుండ నేటి కతఁ♦ డేఁగి ననుం గొని యుందుఁ జేర్ప నే
మన్నె మొగాని నాకుఁ జతు♦రాననదర్శన మబ్బదాయెఁగా.

ఇంతకు నాకర్మమే ముఖ్యకారణము. రాజయోగ మవలంబించి సంసారంబొనర్చు నాబోంట్లకుఁ బుత్రుండులేమిపూజ్యుల దర్శించుటకైన నర్హత లేదయ్యె. అక్కటా! ఎంత యాశతో

నిచ్చటికి బయలుదేఱితినో యంతకంటె నూరుమడుఁగులునిరా
శతో మఱలిపోవలసివచ్చె. నా రాకకై తలవాఁకి లిల్లుగా
వేచియుండు జలజాతనయన కెట్లు లీదుర్వార్తఁ దెల్పుదు.

ఉ॥ నాపతి యాత్మమిత్రుఁడగు ♦ నారదమౌని విమాన మెక్కి, భా
షాపతిఁ గాంచి యాతని ప్ర♦సాదమునన్ గడియించి, యన్వయో
ద్దీపకుఁ బుత్రుఁ గాంచి చను♦దెంచెడువాఁడని గంపెడాస నా
కై పరికించుచుండు కుల♦కామినియో మెటు చూచువాఁడనో ?
అక్కటా! య్యిట్లు విలపించిన నేమి ఫలము? నారదుఁడు నే
నిఁటి కేఁగుతఱికి నాకుఁ దరణోపాయ మెఱుకపడునెనుగదా
కానిమ్ము. అదెట్టిదో కనుఁగొనియెద. [నిష్క్రమించును]



## ద్వితీయరంగము

స్థలకము : మృకండుని తపోవనము - పర్ణశాల.

మరు—(గృహకృత్యముల సాంతముగ నిర్వర్తించి తనదుకూలమును
సవరించుకొని వెలికి వచ్చి యెండ యెంత యెక్కినదో చూచి)
ఇంకను నా నాథుండు రాకున్నాఁడు. అతఁడేగి యచిరకాలమ్మై
నను నా కేమియుఁ దోఁచకున్నది. కాలమెంతయు భారమగు
చున్నది. వారి కెట్లున్నదో ? అక్కటా ! మగవారి కేమి ?
నా బోంట్లకుఁ గదా, కాలము తనకల తెఱంగుఁ దెలుపునది!

మ॥ విహితాచారపరాయణప్రియతనో, ♦ విద్యార్జనక్రీడనో,
బహుధా దేశాటనదర్శనోత్సుకతనో, ♦ భార్యాసుహృద్గోష్ఠినో
బహుధా కాలముఁబుచ్చుచుంద్రు పురుషుల్ ♦ వారింబలెన్నన్ను
బోల్ గృహసంబద్ధకపుత్రకల్పమతి కౌ♦నే కాలమున్ బుచ్చఁగన్
ఇట్లు పతిఁ బాసినప్పుడు, పుత్రుఁ డెక్కడుండినను నిదంతయు
మాఱి యుండుఁగదా !

ఉ॥ ఏ సతికాత్మజాతుఁడుదయించి దివాంతరముల్ సృజించునో
వాసరముల్ క్షణంబగు, విపత్తులు సౌఖ్యము లౌఁ, గుటీర ము
ద్భాసితభర్మహర్మ్య మగు, ధాత్రి దివంబగు, లేమి కల్మియౌ,
నా సతి; కన్యకాంతల కి వన్నియుఁదోఁచు విపర్యయంబులై.

అక్కటా! ఇట్టి మహాద్భాగ్యము నా బోటి మందభాగ్య కబ్బునా? కొలఁదినోములనోచి గొప్పఫలముల నందసాధ్యమా పూర్వజన్మసుకృతం బవశ్య మనుభోక్తవ్యము. ఎట్టి పాప మొనర్చితినో. నేఁడింత సంతాపంబునఁ బొగులుచున్నదాన!

మ॥ హరు సేవింపనో, యబ్జజుం గొలువనో, యబ్జాక్షు నర్చింపనో
సరసీజాలయ వేఁడనో, గిరిసుతన్ శ్లాఘింపనో భూసురో
త్కరముల్ దన్పనో, పూర్వజన్మమున నౌఁ; గాకున్న నీజన్మమం
దరితిన్ వారిని గొల్చు నాక కద! వంధ్యాజీవనం బబ్బునే?

ఇట్లెంత చింతించిన నేమిఫలము! ఈ దుఃఖము సద్దుచప్పుడులేని యాకుఱాయివలె మా సౌఖ్యంబును దినివేయుచున్నది. నా ప్రాణేశ్వరుండు. బ్రహ్మను దర్శించి సఫలమనోరథుఁడై వచ్చిన నీ దుఃఖము పటాపంచలై పోవునుగదా! అయ్యది-
[అర్థోక్తిలో మంజరి తన కుమారుఁడగు చంద్రశేఖరుని చంక నిడుకొనిరా, మరుద్వతి యెదురేగి చంద్రశేఖరు నెత్తుకొని ముద్దాడి] అక్కా! మంజరీ! భోజన మైనదా?

మంజ—ఆహా! అయినదే! నీ భర్త యింకను రాలేదా?

మరు—రాలేదు. ఇదిగో వచ్చెద. (లోని కేగిపూపంబుల చంద్రశేఖరున కిచ్చి బయటికి వచ్చును.)

మంజ—మరుద్వతీ! ఎన్నిమాఱులు వలదన్నను నిట్టి చిఱుతిండి పెట్టి చంద్రశేఖరుని చెఱచెదవేమే? ఇది యభ్యాసమైన మాబోఁటి బీదవారికి వీనిఁ బెంచ సాధ్యమగునా? అందులకు నీ యంత భాగ్యము మాకు వలదా?

మరు—మంజరీ! నిక్కమముగా నీవే భాగ్యవంతురాలవు. స్త్రీలకు సంతానమే సర్వసంపత్తి సంతానమే సంతాన సదృశము. ఇట్టి భాగ్యమంద నీవేమి నోముల నోచితివో కదా !

శా॥ బాలున్ సర్వసుఖాలవాలు, శశివ♦త్ఫాలున్, సువర్ణ ప్రభా
డోలాంతర్గతుఁ జేసి నెచ్చెలులు జో♦డుంగూడి లాలమ్మ! లా
లీ! లాలీ యని జోలఁబాడునెడ హా♦ళింగాంచు నిన్నోపలు స్త్రీ
లాలంబించిన నేమ మెట్టిదో, అపత్యా♦వ్యాప్తికై నెచ్చెలీ!

మంజ—బేలా! నా బోంట్లఁజూచి ఈర్ష్యాళువవు గాకుము. నీ కున్న యితర సౌఖ్య సాధనంబులు మాకున్నమే మిట్లు దుఃఖ మాను దుమా?

సీ॥ కంటిని ఱెప్పవై ♦ ఖరి నిన్నుఁ బ్రోచెడు
తల్లిదండ్రులు నన్న♦దములుండ
కోరి కోరకమున్న ♦ కూరిమి నీ మనో
రథముల సమకూర్చు ♦ రమణుఁడుండ
కనుకలి మాత్రిన ♦ కనుపట్టు నోరుల కా
పాడించు రూపవై ♦ భవము లుండ
అడిగి యడుగకమున్న ♦ నఖిల సపర్యల
సల్పెడు సేవక♦జనములుండ
నదియొ పదో వేలటంచు ♦ నింతతోడ
మానసంబునఁ బరితృప్తి ♦ గానలేక
బిడ్డఁడే లేఁడటంచు దుర♦పిల్లుచుందు
వంబుజేక్షణ! ఆసకం♦తంబు గలదె?

మరు—నెచ్చెలీ! నీ విట్లనిన నే నే మనఁగలను? సంతానంబు నొకవంకయు నితరము సర్వ మింకొకవంకయు వైచి తూఁచిన సంతానమే యెక్కుడగుగదా! అది నీబోటి పుత్రవంతులకుఁదెల్లము గాదేమో కాని నాబోఁటి వంధ్యకు బాగుగా దోఁచుచున్నది. వంధ్యాజీవనము కష్టములు వంధ్యకే తెలియవలయు.

చ॥ కొడుకకు వచించు ముద్దుపలు ♦కుల్కొని సంతసమంది, చేతలన్
చిడిముడిపాటు గాంచి మారు♦సించి, ముఖంబు ముఖంబు జేర్చి ము
ద్దిడి ముదమందువారి బ్రతు♦కే బ్రతుకై తగుఁగాని యక్కటా ?
కొడుకులులేనివారిబ్రతు♦కున్ బ్రతుకే? సరసీరహేక్షణా !

ఇట్టి స్వజనకామ్యంబును, సర్వకాలసౌఖ్యదంబును, సర్వదుఃఖ తిమిరఘ్నంబు నగు సంతానంబును వాంఛించిన నీ విట్లాడ నేమందు. పరిహాసమున కట్లాడితివి కాఁబోలు! లేకున్న నీకు మాత్ర మింతమాత్రము తెలియకుండునా?

సీ॥ నరకవారాన్నిధి ♦ తరియించు నుడుపంబు
దాంపత్యతరుదోహ♦దంపుఫలము
యుగము క్షణము సేయఁ♦దగు నిద్రజాలంబు
గుప్తసుఖము నిచ్చు ♦కుంచెకోల
ఐహికస్వర్గంబు ♦ నగుపర్చు నంజనం
బనురాగవారాశి ♦ కమృతకరుఁడు
విధి చెద్దయముల మజ♦పింపఁజేసెడు మచ్చు
మాతాపితరులకు ♦ నూఁతకోల
కొమరుఁడుండిన వేళ్యాండు ♦ కోర్కెయేల
కొడుకు గల్గిన వేళ్యాండు ♦ ముకుప దేల
నందనుఁడు గల్గ వేళ్యాండు ♦ నాక మేల
సుతుఁడు గల్గిన వేళ్యాండు ♦ సుఖ మ దేల ?

మంజ——బేలా ! ఇది కేవలభ్రాంతి. (స్వగ) పుత్రవ్యామోహమును బోఁ ద్రోల నేమి నుడివినను వృథా యగుచున్నది

మరు——మంజరీ ! ఎన్నటికి నియ్యది భ్రాంతి గాదు.

మంజ——పుత్రులతోడి కష్టములు నీ వెఱిఁగియున్న నిట్లందువా?

ఉ॥ పైఁగలిమిన్న ! నీ కనుభ♦వం బొకయించుక యుండెనేని, సం
వాదమొనర్తు వమ్మ ! యిటు ♦ బాలకుఁ డొక్కఁడు గల్గినంత స

మ్మోదము సర్వకాలములఁ ♦ బ్రోఁదియొనర్చు నటంచునక్కటా!
యేది సుఖప్రదంబొ యది♦యే యసుఖప్రద మం చెఱుంగవే ?

మరు—నెచ్చెలీ! అసుఖమిశ్రితము గాని సుఖదియు లేదని నే నెఱుఁగుదును. అట్లని సర్వసుఖములఁ బరిత్యజించి 'యానందో బ్రహ్మ' యని కాలము పుచ్చుట నాబోంట్లకు సాధ్యమా?

మంజ—చెలీ! అటు చూడుము. ఎవరో మనవంకకు వచ్చుచున్నారు.

మరు—(చూచి) సప్తమహర్షుల భార్యలే ! అదుగో ! అరుంధతీదేవి యిటు వచ్చుచున్నది. ఎందులకో? ఇఁక నాగృహము పావన మయ్యె. నాజన్మంబు ధన్యమయ్యె.

(అరుంధతి ప్రవేశింప నెదురేగి మంజరీ మరుద్వతులు నమస్కరింప)

అరుం—దీర్ఘసుమంగలీ భవ !

మరు—అమ్మా ! అరుంధతీదేవీ ! నేఁడు తమ దర్శనంబున ధన్యారాండ్ర మైతిమి.

అరుం—అమ్మాయీ ! నేనును ననసూయాదులను బ్రాంతాశ్రమవాసులతోడ నేగి యెండయెక్కుటవలనఁ గడుదప్పిగొనియున్నారము. మాకుఁ బానీయము లిచ్చి పుణ్యముఁ గట్టుకొనుము.

మరు—అవశ్యమట్లొనర్చెద. (చంద్రశేఖరుని దించిలోనికేగ మంజరి వాని నెత్తుకొని ముద్దాడును. అరుంధతి దీనిఁ గాంచుచు.)

అరుం—(స్వగ) అక్కటా! ఈ గృహిణి పుత్రవతి యని భ్రమపడి పానీయ మర్థించితి. ఇఁక నేమి సేయుదు. (మరుద్వతి పానీయములు దెచ్చియియ్య నందికొనక) అమ్మాయీ ! నీకుఁ బుత్రసంతాన మున్నదా ? (మరుద్వతి తలవాంచి యూరకుండ, మాటాడక అరుంధతి పోఁబోవుచుండ.)

మరు—తల్లీ! ఇదేమి? నీరు ద్రావకయే పోఁబోవుచున్నారు?

అరుం—అమ్మాయీ ! ఏ మందును ? అపుత్రకులయింట గంగయేని త్రాఁగఁగూడ దని యార్యు లంద్రు. కావున నీ యాతిథ్య

మును మే మంగీకరించరాదు. వే ఆశ్రమమున కేగి మా దాహము దీర్చుకొనెదము. (పోఁబోవ నడ్డపడి)

మరు—తల్లీ! పతివ్రతామతల్లీ! అపుత్రకుల కాతిధ్యాచరణమునకైన నర్హత లేదా? ఏమిచేయఁగలను? పుత్రులకై నే నెన్ని పుణ్యకార్యంబు లొనర్చినను నయ్యవి బీడున జల్లిన విత్తనంబుల వలె వితయయ్యె.

చ॥ వ్రతముల నెన్నొ నోచి, యుపవాసము లెన్నయు సల్పి, బ్రాహ్మణ ప్రతతి నవారిగాఁ దనిపి, పావన♦తీర్థములందుఁ గ్రుంకి, దే వతలకు మ్రొక్కి, యెవ్వరెది ♦ వాకొన నయ్యది యాచరించి, తుట్టతుదకుఁ బుత్రుఁ గాంచ నక♦టా! యిఁక నెయ్యది కార్య మమ్మరో! (పాదములపై వ్రాలి) తల్లీ! నీవే నాకుఁ దరణోపాయము బోధింపవలయు.

అరుం—అమ్మాయీ! లెమ్ము! లెమ్ము! (లేవనెత్తి) దైవకృతంబులు అతివిచిత్రంబులు; సర్వజనదురవగాహంబులు ఆయన భక్త వశంకరంబులు.

శా॥ బాలా! ఆత్మపదారవింద భజనా♦పారీణులం, దన్వగాఁ
బ్రాలేయాచలకన్యకారమణుఁ డా ♦ బద్ధాత్ముఁడై యుండ, ని
ర్లోలా? దైన్యము దూలి వందు రెద వీ ♦ వీసైనఁ గాశీపురిన్
శూలింగూర్చి తపంబొనర్పుము నిజే♦శుంగూడి మేలయ్యెడిన్.

మరు—తల్లీ! అట్లే యొనర్చెద మీ యాశీర్వచనఫలంబున నా మనోరథం బీడేరుగాక! మంజరీ! వీరికి మీ యాశ్రమంబుననాతిథ్య మొసంగి ధన్య వగుము.

మంజ—అట్లె యొనర్చెద. దేవీ, ఇటు, ఇటు!

(అరుంధతి మంజరివెంట నిష్క్రమింప)

మరు—ఇదియే కర్తవ్యము పరమేశ్వరుండు యీ పతివ్రతావాక్య వ్యాజంబున మాకుఁ దరణోపయంబు నిరూపించె. అయిన

నికార్యమునకు నామనోవల్లభు నొప్పించు టెట్లు? అతనితో నీవార్తఁ దెల్పు టెట్లు? తెల్పియొప్పించు టెట్లు?

చ॥ 'కడుపునఁ గన్న పుత్రకులకంటె ఘనంబగు భక్తి నె
ల్లెడఁ గనుసన్నల న్మెలఁగు చెందఱో శిష్యులు గొల్పుచుండ ని
ట్లెడలఁగ నేల? పుత్రుఁడొకఁడైనను లేఁడని పల్కు భర్త కే
వడువున దీని వింతు, మగవాఁడును మానును నొక్కటే కదా!

దైవంబు నాకుగని నిందుల కంగీకరింపఁ జేయఁ జాలు నుపాయంబు నాకు బోధించుఁగాక ! (ఆలోచించుండ మృకండుఁడు దూరమునఁ బ్రవేశించి)

మృకం—అదిగో ! నా తపోవనము. అదిగో నాధర్మపత్ని. నా రాకకై వేచియున్నది. అక్కటా! ఈ యపుత్రదుఃఖంబు మాదాంపత్యసౌఖ్యంబునకు వేరుపురువై యున్నది. నారదుఁ డాడినట్లు నాపతికేమైన నీదుఃఖాబ్ధి తరియించు మార్గ మేదైన బోధించి యుందురా? ఏమో? దాసి కనుగొనియెద. (డాయంబోవ మరుద్వతి లేచి నమస్కరించి పాద్యమొసగి)

మరు—నాథా! బ్రహ్మలోక మెట్లున్నది? మీకా పితామహుని సందర్శనభాగ్యమబ్బెనా? మీ రేగిన కార్యము సఫలమయ్యెనా ? ఏల యిట్లు మౌన మూనియున్నారు?

మృకం—ప్రేయసీ! ఏమి నుడువుటకు నాకు సిగ్గగుచున్నది. నే నెంత యాశతో నచ్చటికి వెడలితినో అంతకంటె ద్విగుణీకృతంబగు నిరాశతో మఱలి వచ్చితిని.

ఉ॥ ఏమని తెల్పువాఁడ హృదయేశ్వరి ! నారదుతోడఁగూడి, పై
తానుమహాలోక మేఁజనిన తక్షణ మచ్చటి ద్వారపాలు రీ
భూమిఁజొరంగరాదు నినుఁబోలు నపుత్రకు లంచుఁ ద్రోలిరన్
మామకపాపకర్మ కవమానము నందుచుఁ గ్రమ్మఱిల్లితిన్.

మను—అక్కటా ! ఈ యపుత్రతాదోషము నీడవలె మిమ్మెక్కడకుఁ గూడఁ దఱుముకొని వచ్చెనా? మీ సుగుణసంపత్తికి, మీ సదాచార సంపన్నతకు, మీ దైవభక్తికి ఫల మపుత్రతయే కాఁబోలు!

సీ॥ క్షీరంబులను గార్చు ♦ చెక్కిళ్ళ నోరూర్చు
తనయుని నోరారఁ ♦ దనుపు సుఖము
తెలిసియుఁ దెలియని ♦ తులువ పను లొనర్చు
తపయుని గనులారఁ ♦ గనెడు ముదము
వచ్చియు రానట్టి ♦ వచనము ల్పచరించు
తనయుని చెవులార ♦ వినెడు హాయు
కనుపడునవియెల్ల ♦ గావలె నని కోరు
తనయుని మనసార ♦ మనుపు ప్రియము
తప్పటడుగు లిడుచుఁ ♦ దటతట నడచుచోఁ
జేతులార సుతుని ♦ చెనకు భాగ్య
మవనిఁ జెంద నోచ♦రైతి రక్కట! తమ
పూతవర్తన కిదె♦పో ఫలంబు!

మృకం—తరుణీ! ఇది పురాకృత కర్మఫలంబు. చింతింప ఫల మేమి?

మను—నాథా ! మీరు రాజయోగమవలంబింపక యితర మునులవలె తారకయోగమునో హఠయోగమునో యభ్యసించిన మీకీ దుఃఖ ముండెడిది కాదుగదా? దానికి నేనే విఘ్నంబనైతి.

మృకం—ప్రేయసీ ! ఇదేమి ఇట్లు మాట్లాడెదవు ? నాకుఁ బుత్రు లున్నను లేకున్నను నీవంటి పతివ్రతాశిరోమణి భార్యయగుట నాకు సౌఖ్యహేతువుగదా !

కం॥ నిను బెండిలియైనది మొద
లనుదినమే ననుభవించు♦నట్టి సుఖం బ
త్యనుపమమై దనరెడుచోఁ
జనునే యిటు మాటలాడ ♦ జలజదళాక్షీ !

మఱియొక విషయ మడిగెద. నీ కెవ్వరైననే నిందులేని యెడమన యపుత్రదుఃఖముఁబాపు మార్గము నుద్బోధించి యుండిరా?

మరు—అవును. దేవా! మీరెట్లు దాని గ్రహించితిరి? గడియ క్రింద నరుంధతీదేవి పిపాసార్తయై వచ్చి పానీయము లడిగి మపుత్ర కుల మని యెఱిఁగి వానిఁ బుచ్చుకొనక పోవుచో నే వెన్నాడి యడుగులఁబడి మాకుఁ దరణోపాయముఁ దెల్పుమనఁ, గాశికేగి విశ్వేశుఁగూర్చి తపంబొనర్చి కామ్యార్థసిద్ధిఁ గనుమనియే. మీ రందుల కంగీకరించినఁ దక్షణము అట్లొనర్పఁ దహాతహా పడుచున్న దాన. ఏమనియెదరు ?

మృకం—ప్రేయసీ! ఏమనియెదరని యుడుగవలయునా? ఈసంశయము నీకుఁ దగునా ?

క॥ వెలఁదీ! నేఁ బురుషుండ నౌ కతన నీ ♦ వీకన్ మనోదుఃఖముల్
వెలికిం జూపక, లోన మ్రింగుకొని యే ♦ వేదాంతమో యూఁతఁ
గాఁ గలకాలంబును బుచ్చ నాగతికి దుః♦ఖం బేమియుండెంద నం
చలుకంబూనకు; మల్లి పోవుదము పు♦త్రావాప్తికై కాశికిన్.

మరు—నాథా! ఇది నిక్కమమేనా ?

మృకం—గోలా! ఇది నిక్కమముగా కేమి? నా మనోగంభీర్యకవచము నిన్ను నా దుఃఖవిషయమున మోసపుచ్చియుండు, నంతియ.

మరు—మీరింత సులభముగా నీకొనినందుల కెంతయు సంతసమయ్యె

మృకం—దాని కేమిగాని, యిఁక ప్రభాతకాలమునఁ బ్రయాణమొన ర్తము సన్నాహమొనర్పుము. ఆశాబద్ధుల కెన్నటికి ననుభవ సిద్ధియే కదా, ఆనందదాయకము!

సీ॥ ఆఁకొన్న వారల ♦ కాఁకలి తీఱునే
సరసాన్నభక్ష్యప్ర♦శంసవలన !
రోగపీడితుల కా♦రోగ్యంబు గూఱునే
కామ్యౌషధీప్రసం♦గంబు వలన ?

లేనివారలకు మహానంద మబ్బునే
ధన ధాన్య వస్తు పర్ణసమువలన?
విషయలోలుపులకు వేడ్కఁ జేకూఱునే
నారీమణీదర్శనంబువలన?
ఆత్మజాతేప్సితుల కపుత్రాధి చనునె
నందనప్రభావాకర్ణనంబువలన?
ఫలితయోగానుభవసిద్ధి వలనఁ గాక;
కాన పోవుద మా కాశికాపురంబు,

అం దేగి మన ధర్మంబును మనము నిర్వర్తింతము. తర్వాత దైవానుగ్రహము. దైవమానుషంబులు సమములు గదా! ప్రేయసీ! రమ్ము. పరమేశ్వరుని ప్రార్థించి భోజనంబున కేగుదము



## తృతీయరంగము.

స్థలకము : రాజమార్గము - గంగానదీ ప్రాంతభూమి.

[మృకండుఁడు, మరుద్వతియు వెనువెంట శిష్యులు రాఁ బ్రవేశింతురు]

రు—నాథా! ఆపురాణదంపతుల లీలల నెన్నిపర్యాయములువిన్నను తనివి గలుగుటలేదు. మఱికొన్నింటిని వర్ణింపుఁడు

మృకం—సతీ! ఆలీలల శ్రీశ వాగీశ భోగీశులే వర్ణింపఁజాలరు. ఏ నెంత వాఁడ? అయిన మార్గాయాస మొకించుక తగ్గింప నిందులకుఁ గడఁగితి. ఆమహాపురుషుని మహాత్మ్య మెఱుంగ నెవ్వని తరము?

క॥ తన కొమరుండు విశాఖుఁడు,
తన తరుణి యపర్ణ, తాను స్థాణుం డయ్యున్
దను గొలుచు భక్తులకుఁ గో
రిన ఫలముల నిచ్చు శాంకరీప్రియుఁ డువిదా!

మఱియు నీతనికి అంబరమే అంబరము; భూతియే భూతి; శూలమే శూలము; కొమరుఁడే కొమరుఁడు; సతియే సతి.

మరు—నాథా! మీరాడినది నిక్కువంబ. ఆ హైమావతి యీతని కన్ని విధములఁ దగిన యర్ధాంగి.

మ॥ పతి భిక్షుత్వము, ప్రేతభూతగణసంపర్కంబు, దోషాకర
ప్రతికర్మంబు, భుజంగశేఖరత, రుద్రశ్మశానాలావాస, మ
న్యతమాలాలకసంగమం బెఱిఁగియున్ భర్తం బ్రపూజించు, ప
ర్వతసంజాత యొసంగుగాత! మనకున్ వాంఛార్థసంప్రాతమున్.

మృకం—ప్రేయసీ! నమ్మిన మనబోంట్లను వారు చే విడుతురా?

మరు—నాథా! ఈ సుగంధిలంబు లగు మందమారుతంబులు, ఈ శ్రుతి పేయంబగు తరంగనిస్వనంబులు ఎక్కడివి?

మృకం—ఇవి గంగానదిని మనము చేరితిమని తెలుపుచున్నవి. నీ వెప్పుడును నీ పుణ్యస్రవంతిని గన్నులారఁ గాంచలేదు కాఁబోలు!

మరు—నాథా! లేదు. కాని తైర్థికులు వర్ణింప వింటిని. ఇందలి భంగంబులు పాపభంగంబులనియు, శీకరంబులు ముక్తికాంతా వశీకరంబులనియు వింటిని.

మృకం—అందులకు సందియ మావంతయు లేదు. దరీస్థితవిటపంబులు ఫలపల్లవపుష్పంబు లర్పించుచుండ శుకపికశారికాచయంబులు సంకీర్తన మొనర్చుచుండ నున్నంతగోత్రసంభవయు, నూర్మిశాకంకణధారియు నగు జహ్నుకన్య కాలము హాయిగాఁ బాపుచు సర్వజనవదాన్యయై ప్రాకుచుండు,

మరు—నాథా! ఇట్టి పుణ్యతరంగిణీదర్శనము మనకు ఆనందదాయికా కుండునా?

మృకం— అందులకు నిస్సందేహము. (ముందునకు నడిచి) అదిగో చూడుము, చూడుము—

సీ॥ పుట్టువు నందె నే ♦ పుణ్యతరంగిణి
అంబుజోదరుని పా♦దాగ్రమందు;
స్థానంబుఁగాంచె నే ♦ తటనీమతల్లిక
అంగజారాతి జ♦టాగ్రమందు;
స్రోతంబు నొందె నే ♦ శుద్ధశైవాలిని
జహ్నుమహాఋషి♦ శ్రవణమందు;
వాసంబుగూర్చె నే ♦ పావన నిమ్నగ
సగరనందనులకు ♦ స్వర్గమందు;
అట్టి ఘనతరంగ ♦ అమలకృపాపాంగ
అఘతమఃపతంగ ♦ అంచితాంగ
త్రిభువన నవరంగ ♦ త్రిపురాంతకాసంగ
గంగ ! యిదిగో కనుము ♦ మంగళాంగి!

మరు—ధన్యోస్మి, ధన్యోస్మి! (నమస్కరించి)



## తురీయరంగము.

స్థలకము : తపోవనము - వారణాసీ ప్రాంతభూమి.

[మృకండుఁడు, మరుద్వతియుఁ దపోనిష్ఠం దగిలియుందురు కొంతకాలమునకుఁ గన్నులఁ దెఱచి]

మృకం—ప్రేయసీ!

సీ॥ తలపైన నొకవంకఁ ♦ దామ్రజటాజూట
మొకవంక శ్యామలా♦లకలు దనర
ఫాలంబునం దొక♦ప్రక్కఁ గుంకుమచిహ్న
మొకప్రక్క భసితభ♦స్త్రికలు మెఱయ
కంఠంబునం దొక్క♦కడ సుమదామ మిం
కొకకడ నస్థిమా♦లికలు వెలయ
ఉరమునం దొకయోజ ♦ నున్నతోరోజ మిం
కొకయోజ ముక్తకం♦చుకము లలర

ఒక్క చేత గాజు ♦ లొండుచే రుద్రాక్ష
లొనర నాత్మభక్త♦జనులకామి
తార్థముల నొసంగు ♦ నర్ధనారీశ్వరుఁ
గనుల కఱవు దీఱఁ ♦ గాంచు టెపుడొ?

మను—నాథా ! ఎంతకాలమైననునామహానుభావునకు దయ గనాగ కున్నది.

శా॥ నేఁడే వచ్చును, రేపెవచ్చు ననుచున్ ♦ నిత్యంబు చింతించుచో
నేఁడుల్ పూఁడలు దాటిపోయినను వి♦శ్వేశుండు రక్షింపఁగా
రాఁ డేని టికినైనఁ; గార్యభరుఁడై రాఁజాలఁడో; లేక వి
న్నాఁడో లేదొ మదార్తివార్త; వినియున్ న♦న్గావ వాంఛింపఁడో?

మృకం—దేవదేవా! వేదాంతవేద్యా ! నేను దీనుండను. నీవు దీనబంధుఁడవు. నేను భక్తుండను, నీవు భక్తవత్సలుండవు. నీవ దక్క నన్ను రక్షించువా రెవరు ? నీ వాశ్రిత గుణాగుణముఁ నెంచకయ రక్షించు వాఁడవు. నాయెడల నిట్లదయావృత్తి బూన నేల ?

సీ॥ గురుదక్షిణగ గురు♦తరుణిని జెఱచిన
దోషాకరుని దలఁ ♦ దాఁడఁగ లేదె ?
నిలువెల్ల భంగముల్ ♦ నిండిన జాహ్నవీ
తటినిని జటయందుఁ ♦ దాల్పలేదె ?
కోరల గరళంబుఁ ♦ గుమ్మరించెడు సర్ప
ముల భూషణములుగా ♦ సలుపలేదె ?
సర్వభక్షకుండయి ♦ సాధ్యసంబునుగూర్చు
చిచ్చును గన్నుగాఁ ♦ జేయలేదె ?
భీతియును రోఁతయును గొల్పు ♦ ప్రేతభూత
గణములను నాయకుండవై ♦ మనుపలేదె ?
ఈశ ! నీభక్తవాత్సల్య ♦ మింకనైన
మా యెడంజూపి సుమ్మోల ♦ మనుపరాదె ?

పరమేశా ! దురంతంబును, దుఃఖజనకంబును, దురితనిలయంబును, దురాశాభూయిష్ఠంబును నగు సంసారవారాశిఁ దాఁటఁ దరపోపాయం బగు ప్రభుని బ్రసాదింప మిమ్ము వేఁడ మీరు మా మొఱాలకింపరేల? బ్రహ్మ మా నొసట వ్రాసిన వ్రాఁతను మీరు తుడుపలేరా ? ఈ మాట విశ్వసనీయమా? ఆ బ్రహ్మ యైదవతల నొక్క గోటితో మున్ను ద్రుంచియుండలేదా ? లేక చతురాస్యుండు భక్తుం డని భక్తవాత్సల్యంబున నట్లొనర్ప వెనుఁ దీసెదరా? కొంకు జంకులేక భక్తపాలన మొనర్చు మీ కిట్టి కుశంక లుప్పతిల్లునా ? లేక మీ కభీష్టములగు వస్తు సామగ్రిచే మేము మిమ్ముఁ బూజింపమిఁ దనివిఁ జెందకుంటిరా ?

సీ॥ క్షీరాబ్ధి మథియింపఁ ♦ జేతఁగా దింకెట్లు
గరళంబుఁ జేకూర్తు ♦ గరళకంఠ !
పాతాళమును జేరఁ ♦ బ్రవణుండఁగా నెట్లు
ఫణుల సమర్పింతు ♦ ఫణికలాప
మృగముల వేఁటాడఁ ♦ దగవరిగా నెట్లు
ద్విరదచర్మము నిత్తు ♦ ద్విరదచర్మ !
గవ్యభక్షణంబులఁ ♦ గలవాఁడఁగా నెట్లు
వృషభంబు నర్పింతు ♦ వృషభవాహ !

అకట ! నీ మానసమునకు ♦ సుకము గొలుపు
శశిభూషణ వసన వా♦హనము లొసఁగఁ
జాల నని నన్ను రక్షణ♦సలుప వేమొ
భక్తికంటెను నీ కిష్ట ♦ వస్తు వున్నె ?

భక్తి యొక్కటి సమకూరిన వేఱెయ్యదియు నీశ్వరప్రీణనంబున కనవసరమని బుధు లాడియుండ మీ భక్తుల నిట్లు కటాక్షింపకుంట న్యాయమా? ఒకవేళ నిన్నుఁ బూజింపఁదలచిన దేనితోఁ బూజింతు.

సీ॥ అమర స్రవంతిని ♦ నవతంసముగఁ గొన్న
నీలకంఠునకుఁ బా♦నీయమేల ?
అమృతాంశు నవవర♦తాశ్రితుగాఁ గొన్న
వృషభధ్వజునకు ♦ నైవేద్య మేల ?
హవ్యవాహుని మూఁ♦డవ కన్నుగాఁ గొన్న
పరమేశ్వరునకు ని♦ వ్వాళు లేల ?
మణియు తోరగముల ♦ మండనంబుగఁ గొన్న
గౌరీధవున కలం♦కార మేల ?

యనుచు బుధులాడ నీ పదా♦ర్థార్జనమునఁ
గాలమును విత బుచ్చక ♦ నీలకంఠ !
యాత్మ నైవేద్య మర్పించి ♦ యధికభక్తిఁ
గొలుచు మ మ్మాదరింపగాఁ ♦ దలఁపవేమి ?

మరు—లేక మీరు మున్ను గొందఱి భక్తులయెడ జపతపంబులఁదృప్తి జెందక వింటిదెబ్బల, ఱోకలిపోటుల, ఱాళ్ళవానలఁ గోరి సాక్షాత్కరించితిరని పెద్దలు వక్కాణింతురు. అట్లు మే మొనర్పలేదని యేమైన ననుగ్రహింపకుందురా ? దేవా ! ఆ యపచారంబు లన్నియు మీ భక్తవాత్సల్యంబును వేనోళ్ళఁ జాటుచుండలేదా ?మాపై దయఁబూనరాదా ?

ఉ॥ సారవిదుండు, యాచకవ♦శంగతుఁ డార్తజనావనుఁడు. సం
సారసుఖేంగితజ్ఞుఁడు వృ♦షధ్వజుఁ డంచు బుధు ల్వచింప, నీ
చేరువ గంపెడాసఁ గొని ♦ చేరి తదేకతపోనిరూఢిమై
కూరిన నెంతకాలమున♦కుం గరుణింప విదేమి యీశ్వరా !

ఈశ్వరుండు పార్వతీసహితుండై ప్రత్యక్షముగాగ నిద్దఱు మోఁకరించి;

మృకం—
సీ॥ దండంబు దానవ♦శుండాలదండన
మండిత శూలత్రి♦ఖండి ! నీకు
చేమోడ్పుచేత స్థి♦తామేయ మదలోభ
కామప్రణాశనో♦ద్ధామ ! నీకు
జోహారు భక్తసం♦దోహాపదపహారి
సాహాయ్య సాహసో♦త్సాహ ! నీకు
జే! జే! హిమానీత♦నూజాసమర్పిత
పూజితార్ధాంగ పం♦కేజ ! నీకు
ఐమువదు లాత్మభక్తాను♦మోద ! నీకు
ప్రణతిశతములు త్రిభువన ♦ ప్రణుత ! నీకు
వే నమస్కృతు లార్తజ♦నీన ! నీకు
కోటిమ్రొక్కులు దుర్జనాస్ఫాట ! నీకు.

మరు—దేవా! బ్రహ్మ మా కపుత్రదుఃఖ బు చేకూర్చెనని చింతించుచుంటిమి. నేఁడు మీ దివ్యమంగళ దర్శనంబున మా పాపపాటు గ్రహించితిమి. దానిచేతనే నేఁడు దీనపోషణమును, సకలశుభావహంబును నగు మీ కటాక్ష వీక్షణంబునకుఁ బాత్రులమై ధన్యులమైతిమి.

శంక—భక్తులారా! లెండు. మీ యఖండభక్తికి, మీ జప తపోనురక్తికి మెచ్చితి.

మ॥ తొలిజన్మంబునఁ గన్నుఁగానక నను ♦ న్దూషించుటంజేసి, మిమ్ముల నీ జన్మమునం దపుత్రకులఁగాఁ ♦ బుట్టించితింగాని; మీరలు గావించిన యీ మహాజపతపో♦వ్రాతంబునం బిట్టు రంజిలి యేతెంచితి వేఁడుఁడీ, వరము మీ ♦ చిత్తానుసారంబుగన్.

మృకం—దేవా! సర్వజ్ఞులరగు మీకు మా మనోభీప్సితంబు మేము తెలుపవలయునా?

శివ—మునీంద్రా! నీ యభిప్రాయంబు గ్రహించితిని.

మ॥ ప్రమదోత్పూరితభూరివర్తను శతాబ్దప్రాయునిం గాని, యు
త్తమవిద్యాపరిపూర్ణ షోడశశరత్ప్రాయాంచితుం గాని, మీ
కొమరుం జేయఁగ నిచ్చయించితిని సంకోచంబు పోనాడి, యి
ష్టము నీ కెద్దియొ తెల్పుమీ యటుల నే సంధింతు భక్తాగ్రణీ!

మృకం—దేవా! మీ రిట్టివిషమప్రశ్న వేసిన మే మేమి ప్రత్యుత్తర మీయఁగలము? విద్యావిహీనుండగు దీర్ఘాయువు మా కులంబు నకుఁ గళంక మాపాదించు. విద్యావిభూషణుండగు నల్పాయువు మా మోక్షంబున కంతరాయంబు గల్పించు. ఇట్టిచో మాకుఁ గామ్య మెయ్యదియో?

మరు—(పార్వతివంకఁ దిరిగి) లోకమాతా! తనయునకై మోము వాచిన మాకు దీర్ఘాయుష్మంతుడును, గులయశఃప్రసారుండును నగు కుమారు దయచేసి మా వంశంబును నిల్పిమాదుఃఖంబు బాప వర మనుగ్రహింపరాదా? ఈ వరముల దేనిఁ గోరినను మాకుఁ దృప్తి జనియింపదుగదా!

ఉ॥ పిల్లలు లేరులే రని తపించి తపించి తపోనిరూఢి, మి
మ్ముల్లమునందు నిల్పి వినయోత్సుకతన్ భజియించినట్టి, మా
కుల్లసమీయ, నీ వర, మయో! తగదంచుఁ ద్వదీయనాథుతోఁ
బిల్లలఁ గన్నదాన వలికేదిరో! నీవయినన్ వచింపుమా.

పార్వ—అమ్మాయీ! ఇప్పటికి దీనితోఁ దృప్తినందుము. భక్తైక వశంకరుండగు మన్నాథుండు మిమ్ముబోలు భక్తులను బాలింప కుండఁడులెమ్ము. నారుపోసినవాఁడు నీరు పోయకుండఁడు. కావున భయము వదలి వరమడుగుఁడు.

మృకం—(మరుద్వతితోఁ గొంత యోజించి చేతుల జోడించి) దేవాదిదేవా! పురాణపురుషా! భవదీయకృతంబులు సర్వదా సర్వథా శుభదాయకంబులని నెమ్మది నమ్మితిమి. మాబో

యల్పజ్ఞులకు ప్రస్తుతకార్యంబులు మాకు శుభావహంబులని తోఁచకుండవచ్చు. అయిన మీరు శిష్టరక్షణులై యుండ మాకు భయమేల ?

ఉ॥ ఓ యమలాంతరంగ ! కరుణోదధి ! దూష్యచరిత్రుఁడైన వీ
ర్ఘాయువుకంటె, సర్వసుగుణౌఘసమేతచరిత్రుఁడైన య
ల్పాయువె వాంఛనీయుఁ డగు నాత్మజుగానని పెద్ద లందు రా
చాయనె మాకుఁగూర్చి యఘసంహతిరూపును మాపజేయుమా!

మరు—దేవా ! కుపుత్రత్వంబునకంటె నపుత్రత్వంబె మేలని యార్యు లండ్రుగదా !

చ॥ మునినుత ! భూమిపై జనిన మూఁడుదినంబులు తల్లిదండ్రులం
దన సుగుణాళిచేతఁ బ్రమదంబునఁ దేల్పఁగఁజేని పుత్రకుం
గనినను జీకయున్నను నొకండగుఁ గావున మాకుఁ గూర్పు నం
దనునిగ సర్వసద్గుణసనాథుని షోడశవర్షమాత్రునేన్.

శంక—భక్తులారా ! మీ యభీష్టంబు లీడేరుగాత! ఈ యాయుర్విష యమును గోప్యముగా నుంచుఁడు.

(పార్వతి, శంకరు లదృశ్యు లగుదురు)

మృకం—దేవా ! అట్లే యొనర్చెదము. ఆహా ! అదృశ్యులైరిగదా ! ప్రేయసీ ! మనకామితార్థంబు కొంతయైన నీగరళకంఠుని కారుణ్యంబున నీడేఱె. ఇఁక రమ్ము. శిష్యులంగూడి పూర్వాశ్రమంబున కేఁగుదము.

మరు—నాథా ! అట్లే కానిండు. ఈ భక్తవత్సలుఁడు మనలఁబోలె తను నమ్మినవారిఁ జేవిడుచునా ?

# భక్తమార్కండేయ

## ద్వితీయాంకము



### ప్రథమ రంగము.

స్థలకము : కుటీరము

[మరుద్వతి దుఃఖార్తయై నేలఁ జతికిలఁ బడియుండును.]

మరు—అక్కటా! నన్నుఁబోలు దుఃఖార్త లీలోకంబునఁ గలరా?

ఉ॥ సుందరులీ ధరిత్రి, నిజ•సూనులు శైశవముం దరించి పెం
పొందఁగలార లెప్పుడను • చువ్విళులూరుచు నుంద్రుగాని, నా
చందమునక్షణక్షణము • శైశవముం దరియించు పుత్రు, దై
వందినవృద్ధిఁ గన్గొని మ•నంబున బెగ్గిలువార లుందురే?

ఏటికిఁ దపంబొనర్చితిమి? మా కేటికి శివుఁడు ప్రత్యక్షమయ్యె? అతఁ డేటికిట్టి యసౌఖ్యదాయకంబగు వరంబుఁ బ్రసాదించె? అట్టిదాని మేమేల గ్రహించితిమి?

చ॥ వెకలిఁ, గళావిహీను, శత•వృద్ధుని బుత్రుగఁ గోరుకొందువో,
సకల కళావిశారదుని • స్వల్పవయస్కుని పుత్రుగాఁగఁ, గో
రుకొనెదవో వచింపుమని • రుద్రుఁడు కోరినఁ గ్రిందుముందుఁ దెఱుం
గక యిటులేల కోరితి నిఁ•కన్ సుఖముందఁగ నాకు సాధ్యమే?

ఇంతవరకు బుట్టినదాది పుత్రుఁడే లోకంబుగ భావించి చరించుచుంటి. ఇఁక నాతని కక్షరాభ్యాసమొనర్చి గురుకులావాసంబున కంపవలయు. అందులకు ముహూర్తము డాయుచున్న దిఁ... యొనర్తు? నాయవస్థ నెవనితో మొఱలిడుదు?

మ॥ 'పదునారేండ్లుమాత్రమే బ్రతుకు మీ♦బాలుం డంటం జెప్పు డా
మదనధ్వంసి వచించియుండ, మన మీ ♦ మార్గంబునం బుత్రకుం
జనవం బెట్టు నెపంబునం బరునిపం♦చం జేర్పంగానేల?' నా,
సదయాబద్ధమనస్కుండై పలుకుచుం ♦ డాత్మేశుండో దైవమా!

ఇంకం గొలందికాలమున కాతండు గురూత్తముండగు సుబంధుం దోడితెచ్చు. ఈవియోగ మెట్లోర్తు? దీనినే యోర్వలేకున్న నచిర కాలంబున రానున్న చిరవియోగంబు నెట్లోర్తు? ప్రారబ్ధ ముప భోగక్షపితము గావలయుంగదా! అడుగో! మంజరీపురస్సరుండై నాముదుంగూన యిటు శివస్తవమొనర్చుచు వచ్చుచున్నాండు.

(మంజరితోడ మార్కండేయుండు శంకర స్తవ మొనర్చుచు ప్రవేశింప)

మరుద్వతి - (మార్కండేయుని డాసి కన్నీళ్ళు తుడిచికొని)

క॥ రారా చిన్నికుమారక!
రారా నోములఫలంబ! ♦ రారా తనయా;
గారాబముతోడుత నా
పోరాములఁ బాఱంద్రోలి ♦ బ్రోవంగ నిటకున్.

(మార్కండేయుండు నమస్కరింపం గౌంగిలించును.)

మార్కం—తల్లీ! గురువులవారు వచ్చిరా? ఏల కన్నీళ్ళు బెట్టి నట్లున్నావు? ఎప్పుడులేని చింత నీ కేల? నే నేమైన నెఱుంగక తప్పొనర్చితినా?

మరు—నాయనా! లేదు, లేదు.

మంజ—నెచ్చెలీ! నీచర్య విచిత్రముగా నున్నదే. ఇట్టి ముద్దులమూట నీకుం గుమారుడై యుండం జింత యేల?

ఉ॥ ఈ పసిపిల్లవాని జన♦నేతరవాసన యేమొ, చూడంగా
నోచిన నాంటంగోలె, శివు ♦ నొక్కనిం జూడంగంగోరుం, బాడగా
నోచిన నాంటంగోలె భవు ♦ నొక్కనిం బాడంగంగోరు; వేడంగా
నోచిన నాంటంగోలె హరు ♦ నొక్కని వేడంగంగోరు నెచ్చెలీ!

మరు—(స్వగ) అక్కటా! వీరితో నా మనోదుఃఖమునకు నిజమగు
కారణ మెట్లు నుడువుదు ?

మార్కం—తల్లీ! ఏమి మాటాడకున్నావు ?

మరు—నాయనా ! ఏమని నుడువుదును.

ఉ॥ పెన్నిధిఁగన్న పేదవలెఁ ♦ బెంచితిఁ గాంచిన నాఁటఁగోలె, ని
న్నన్నరో ! నేఁటిదాఁక నిఁక ♦ నంచితసర్వకళాతిరేకసం
పన్నుని జేయ నిన్ను గురు♦వర్యున కప్పన సేయుకాల మా
సన్నముగాఁ జరించుట వి♦షాదము పైకొనుచున్న దాత్మజా !

మార్కం—అమ్మా! నీవు చెప్పినది నా కొక్కటిఁ దెలియలేదు.

మరు—నాయనా ! నిన్ను నేఁడు చదువవేసి, గురువులవారియొద్ద
వదలవలయు.

మార్కం—అమ్మా ! నీవును, నాయనయుఁ గూడ రారా ?

మరు—నాయనా ! వచ్చుటకు వీలులేదు.

మార్కం—అట్లైన నే నొంటిగా నం దుండఁగలనా ? (ఏడ్వఁబోవ)

మరు—నాయనా ! ఏడువకుము. మే మప్పుడప్పుడు వచ్చి చూచి
పోవుచుందుము.

మార్కం—అమ్మా ! నేను చదువుకొనిన నాయనవలెఁ బుస్తకములు
చదువఁగలనా ? పిల్లవాండ్రకు నేర్పఁగలనా ?

మరు—నాయనా ! అందులకు సందియమా ?

మార్కం—అమ్మా ! చదువురానివాఁడు పశువుతో సమానమని
నాయన చెప్పినాఁడే. నిజమేనా ?

మరు—అవును, తండ్రీ ! అవును. అందువలననే నిన్నుఁ బనుపఁంచ
వలసి వచ్చినది. (మృకండుఁడు సుబంధునితోడను
గొందఱు బ్రాహ్మణ బాలకులతోడను బ్రవేశించి)

మృకం— ప్రేయసీ! అంతయు నాయితముగా నున్నదా? (మార్కండేయుఁడు నమస్కరింప నెత్తికొని) నాయనా! (సుబంధునిఁ జూపి) వీరు మీ గురువర్యులు. వీరికి నమస్కారమొనర్పుము. (చేతులు జోడించి నమస్కరింపఁ జేయును.)

సుబం—దీర్ఘాయుష్యమస్తు. (అని ఆశీర్వదించును)

మరు—(పతిని చేఁబట్టి తివిచి, యెడముగాఁ గొంపోయి) నాథా! ఇప్పుడైన నామాట వినుఁడు.

చ॥ బ్రతికెడు నాల్గునాళ్ళ సుత♦బాలకు దగ్గఱ నుంచకుండ, ని
వ్వితమున విద్య నేర్చుకొన ♦ వేఱొకచోటికిఁ బంపినంత, నే
గతి హృదయంబునందనిచిఁ♦గాంచక చిందులు ద్రొక్కు కోర్కులా
మెతఁగనుఁ గాన నోరమణ! ♦ మీ జతనంబుఁ ద్యజింపుఁ డింత నేఁ.

మృకం—బేలా! ఇదేటి ప్రార్థన? విద్యావంతుఁడును, యశోవంతుఁడును నగు షోడశవర్షప్రాయుని, మూర్ఖుఁడగు శతవృద్ధునికంటె వాంఛనీయుఁడని నాఁడు కోరుకొని, నేఁడు నీవు నుడివినట్లు విద్యాభ్యాసమొనర్పకున్న నీతఁడు మూఢుండును షోడశవర్షప్రాయుఁడును గాఁడా? అందుచేత మనము రెంటికిఁ జెడిన రేవళ్ళము గామా? ప్రేమము నీ జ్ఞానప్రభను మందగింపఁజేసినది సుంత యోజింపుము.

శా॥ ఈమాడ్కిన్ బ్రొగడొంద నీ కగునె యిం♦తీ! బాలుఁ డీ సర్వవి
ద్యామందారు సుబంధుతోడుతఁ గళా♦భ్యాసార్థమై పోవఁగా
నే, మాయంబయి పోవునా? తఱుచుగా♦సిక్షింప నచ్చోటికిం
బోవో, రామొ? యికేలభీతి యెద వో♦త్పన్నత్వపాటింపుచూ.
మఱిఁ బదునైదవ సంవత్సరము రాఁగానే రప్పించెదను. ధైర్యముఁ జిక్కఁబట్టుము.

మరు—ప్రాణేశా! అట్లే మీ యిష్టానుసారము గానిండు. (పీఁటలపై దంపతులు గూర్చుండి అక్షరాభ్యాసముఁ గావించి గురువునకు

దక్షిణ తాంబూలములనిచ్చి, బ్రాహ్మణులఁగూడ సత్క-రించి, తోడిబాలురకు సెనగలు బెల్లము పంచి మార్కండే-యుని గురువున కొప్పగించుచు)

మృకం—మిత్రా! సుబంధూ! నా చిన్నికుమారుని, సత్వరంబ సకల కళా కలాపుఁజేసి నాయొద్ద కంపుము. ఇంతకంటె నీబోంట్లకు నేనుఁ జెప్పన దేమి కలదు?

మరు—(సుబంధు పాదములకుఁ బ్రణమిల్లి) పుత్రు పాలముంచినను, నీటముంచినను వీనికి మీర దిక్కు.

ఉ॥ కానకకన్నకందు వని ♦ కంటిని తెప్పవిధంబునన్ బహిః
ప్రాణముబోలెఁ బెంచి, యిప్పు♦డై దవ వర్షము రాఁగ సర్వవి
ద్యానిధిఁజేయ మీకడకు ♦ నంపఁగనెంచితి మింక నార్యవ
ర్యా! నెనరూని ప్రోవుఁడు మ♦దాత్మజు మీ ప్రియసూనులింబలెన్.

ఇదియే నాప్రార్థన.

సుబం—మరుద్వతి దేవీ! పుత్రపోషణంబునఁ దల్లిని బోల నేరితరము? అయిన నాశక్త్యనుసారంబుగాఁ గట్టవ త్తివై చుకొని మీ బాలకుఁ బోషించి, దైవానుగ్రహమున సర్వవిద్యావిభూషితుఁ జేసి మీకు సత్వరంబుగ నొప్పగించెద. భీతిల్లకుము. ఈ బాలురందఱు సహోదరులవలె నీముద్దుకూనను జూచుచుందురు. మార్కండేయా! నీతల్లిదండ్రులకు నమస్కరించి సెలవడుగుము.

మృకం—(మార్కండేయుఁడు నమస్కరింప) నాయనా! నిన్ను మేము వచ్చి పలుమారు చూచుచుండెదము. నీవు బుద్ధిగుదిరి చదువుకొని త్వరలో విద్యావంతుఁడవై నీకుఁ బేరు తెచ్చుకొని, మాకును బేరు తెమ్ము.

మరు—(మార్కండేయుఁడు నమస్కరింప గౌఁగిలించుకొని) నాయనా! చదువఁబోయెదవా? పొమ్ము. నిన్నా పరమేశ్వరుండు పోషించి

విద్యాయుతుఁ జేసి సురక్షితముగా నచిరకాలమున మా కడకుఁ జేర్చుంగాత !

సుబం—మార్కండేయా ! ఇఁక రమ్ము. (మరుద్వతి వదలకున్నఁ జేపట్టి లాగ)

మరు—(తోడిబాలురఁ గాంచి) నాయనలారా! నా బాలుని మీచిన్న తమ్మునిగాఁ జూచి పోషించి నా కృతజ్ఞతకుఁ బాత్రులుగండు.

శిష్యు—అట్లయొనర్చెదము. భయపడకుండు. రా! మార్కండేయా! రా!

మరు—నాథా! మనముఁ గొంతదూరమేఁగి సాఁగనంపి వత్తము, రండు!

మృకం—అట్లే కానిమ్ము. (అందఱు నిష్క్రమింతురు)



## ద్వితీయ రంగము

స్థలము సుబంధు నాశ్రమము - పల్లెకూటము

(మృకండు నాశ్రమమునుండి యొక మునిబాలుఁడు ప్రవేశము)

మునిబాలుడు—ఇదియే సుబంధు నాశ్రమమని తోఁచుచున్నది. అదుగో యెవఁడో మునిబాలుడుకూడ నక్కడఁ గన్పట్టుచున్నాడు. పిలిచెద. ఓయీ! (పిలువ సుబంధుశిష్యుఁడొకఁడు ప్రవేశించి)

సు-శి—ఎవరు నన్నుఁ బిలిచినది ?

ముని—నేను. ఇదియేనా, సుబంధు నాశ్రమము ?

సు-శి—అవును.

ముని—ఇక్కడ మార్కండేయుఁ డున్నాఁడా ?

సు-శి—ఆహా ! ఉన్నాఁడు. ఇప్పు డేమి వార్త దెచ్చితిరి ?

ముని—అతనితలిదండ్రు లాతని గురువులవారివద్ద సెలవుగై కొనిరమ్మనిరి. నేను వార్తఁ దెల్పవచ్చితిని.

సు-శి—అయ్యో ! మార్కండేయుని బిల్చుకొనిపోయెదవా ?

ముని—అవును. ఇక్కడింకతని కేమి పని యున్నది ? పదివత్సరము
లలో, నాభోంట్లు శతవర్షములలోనైన నేర్వఁజాలని సర్వవిద్యల
గాలిని బీల్చినంత సులభముగాఁ జూఱఁగొనియె.

సు-శి—అవును. మాగురువులవారింక నేఁ జెప్పఁగలిగిన దింకలే దని
మొన్ననే నుడివిరి. అయిన నాతఁడుండ మాకెంతయో సుఖ
ముగాఁ గాలము గడిచిపోవుచుండినది. ఇం కెట్లుండునో ?

ముని—దాని కేమి ? వానితలిదండ్రులు కానకకానక కన్న కందు వని
వానిఁగాంచఁ దల్లడిల్లుచున్నారు. రమ్ము. మీగురువుగారిదగ్గ
ఱకుఁ ద్రోవఁదీయుము.

సు-శి—ఇటు, ఇటు. (నిష్క్రమించును.)



## తృతీయరంగము.

స్థలకము : సుబంధు నాశ్రమము, పల్లెకూటము.

(మార్కండేయుఁడు సహాపాఠులం గూడియుండును )

మార్కం—మిత్రులారా! మీరు నుడివినదంతయు నిక్కువమైనను నే
నింక నాలస్యమొనర్చుట తగదు. నేనింకఁ బోయివచ్చెద.

మ॥ తలిదండ్రుల్ నను వేగ రమ్మనుచు వార్తంబంపి రాచార్యవ
ర్యులుగూడ న్సెలవిచ్చి రిందనుక సౌఖ్యోపేతమై జీవితం
బలరారెన్ భవదీయమైత్రి, నిఁకపై నస్మద్గృహంబేఁగఁగా
సెలవుంగూర్చి సతంబు నాయెడల మీస్నేహంబుఁ బాటింపుఁడీ.

1వ శిష్యు—మిత్రమా ! కానిమ్ము. నిన్నెప్పటికైన మఱువ మాకు
సాధ్యమగునా ? మమ్ములఁగూడ నీవు మఱువకుండవలయు.

మార్కం—శిఖండివాహనా! నీవు నా కీవిషయము బోధింపలయునా?
వసంతకాలంబున నూతన పల్లవాంకురశోభితంబగు మావిగున్న
నాశ్రయించు శుకంబులవలెమన మెక్కడెక్కడనుండియోయీ

విద్యాసాగరుం డగు సుబంధుకడఁ జేరి బాల్యమును వెడలఁ బుచ్చితిమి. ఈకాలమున నందిన సుఖంబుల మఱువవలయునన్న మఱపునకు వచ్చునా ? హితులారా ! ఇఁక నాకు సెలవా ? (నారదుఁడు వచ్చి మాటున నిలుచును.)

2వ శిష్యు—మార్కండేయా! నీవండనుండ మా కెట్టికష్టములు వచ్చినను తృణప్రాయంబుగఁ జూచుచుంటిమి. నీవేఁగిన మా కింక దిక్కెవ్వరు ? కష్టంబులఁ బాఱఁద్రోలి సుఖించుటకుఁ గర్తవ్య మెద్ది ?

మార్కం—మిత్రా ! మంచిప్రశ్న నడిగితివి. నేనును మిమ్ముఁబోలెఁ జిన్నవాఁడనైనను, న న్నొకపెద్దఁ జేసి యడిగితివిగాన నాకుఁ దెలిసినది నుడివెద వినవలయు.

మ॥ హితులారా! యొకమాటఁ జెప్పెదనుసుం♦డీ! మీకు మున్మున్న నీ
క్షితియం దెట్టివిపత్తుగల్గినను నే ♦ చేడ్పాటు చేకూరినన్
వ్యతిరేకంబుగఁ గోర్కెలారినను మీ♦ భావారవిందంబులన్
సతతం బాపరమేశ్వరార్చనల వి♦శ్వాసంబుఁబోనీకుఁడీ !

చ॥ చదివిననార మున్నిఁగల ♦ శాస్త్రములన్నిటి నంచు పొంగ, కీ
చదివిన దెంతమాత్రమని ♦ స్వాంతమునం దలబోసి, యెన్నియేన్
జదువులచేఁ గనుంగొనఁగ ♦ సాధ్యముకాని మహేశు భక్తి నె
మ్మది భజియించుచుండుఁ ♦ డసమానవిముక్తి వినిశ్చితాత్ములై.

మీ రిట్లొనర్చి విపదంబుధిఁ దరింపుఁడు.

2వ శి—మిత్రమా ! తప్పక యట్లేయొనర్చి కృతార్థుల మయ్యెదము.

మార్కం—హితులారా ! అట్లైన నిఁక నొకసారి హరనామసంకీర్తన మొనర్తము రండు ! (అందరు పాట)

సుహృద్వరులారా ! ఇఁక సెలవా ? (పోఁబోవుచుండఁ)

1వ శిష్యు—మేమును నీతోడ వచ్చి సాగనంపెదము. (తెరపడును)

మార్కం—అట్లేనికాండు. [నిష్క్రమింతురు నారదుఁడు ససంభ్రమమున బయటికి వచ్చి]

నార—

మ॥ భళిరే! హైమవతీమనోహరుప్రభా♦వం బక్కసోమంబు, భూ
వలయంబందున నింప, నంతకుని దు♦ర్వారాభిమానంబుఁ దుం
గల ముంపంగల సర్వాలక్షణ సమా♦క్రాంతున్, హరాసక్తని
శ్చలచేతస్కుని బాలభక్తుఁ గనితిన్ ♦ జన్మంబు ధన్యంబుగాన్.

ఏమియుం దోఁపక భూలోకసంచార మొనర్చుచు సుబంధుసుహృద్వరు నాశ్రమంబున కేఁగ నీబాలేందుమౌళిబాలభక్తమార్కండేయుఁ గాంచితి. ఇతఁడు పదునాఱవ వత్సరంబున మరణంబుఁ గాంచవలసియున్నాఁడు. ఈతనిమూలంబున శివుని భక్తజనావనాసక్తిఁ బ్రకటించెద. యముని శైవద్వేషమునకు, శైవదూషణమునకుఁ దగిన శిక్షఁ జేయించెద ఆహా! నాఁడు శమనుం డాడిన శివతిరస్కారోక్తు లామూలంబు నాచెవుల ముందులవలె నాటియున్నవి.

మ॥ 'నరుల సృష్టి యొనర్ప నబ్జజుఁడు, సం♦త్రాణంబుఁ గావింప శ్రీ
ధరుఁ, డున్మూల మొనర్ప నేను గలుగన్ ♦ త్యాజ్యుండు మూర్తిత్ర
యిన్ హరుఁడంచుం దెలియంగలేక జడు ల♦త్యంతంబు పూజింతు'
రం చరరే! పల్కిన ప్రేతరాజునకు స♦త్యం బింక రూపించెదన్.

సుహృద్వరుం డగు సుబంధు నాతిథ్య మంది, పిమ్మట బ్రహ్మలోక మేఁగి కర్తవ్యం బెఱింగి, మృకండు నాశ్రమ మేఁగి మార్కండేయునిచేఁ గర్తవ్య మొనర్పించి శమనునకు గర్వభంగంబును, మార్కండేయునకు దీర్ఘాయుష్యంబును సమకూర్పఁ బ్రయత్నించెద. [నిష్క్రమించును.]



## తు రీ య ర ం గ ము.

స్థలము : మృకండు నాశ్రమము

[మరుద్వతియు, మృకండుఁడును దర్భాసనమ్ముల విచారాక్రాంతులై యాసీనులై యుందురు.]

మరు—నాథా! మీరెంత వేదాంతము బోధించినను రానున్న పుత్రమరణశోకమును దలంచినంత నామనంబు చేఁ బెట్టి కలఁచినట్లున్నది. పై ప్రాణములు పైననే పోవున ట్లున్నవి.

మృకం—చపలా! ఇచ్చిన వాఁడే పుచ్చుకొననున్నవాఁ, డందులకింత చింత యేల? మనము బాగుగాఁ దర్కించియేగదా, సకలకలాకలాపుఁడును షోడశ వర్ష ప్రాయుఁడును నగు బాలకుఁ గోరితిమి? దీని కెవరి నేమనిన నేమిలాభము? ఎంత దుఃఖించినను, నెంత విచారించినను నీశ్వరఘటన కన్యథాత్వము సిద్ధించునా?

మరు—నాథా! మీమనోదార్ఢ్యమునాకు లభించునా? మన బాలుండు సకలవిద్యాపారంగతుఁడై మనవంశ కేతెంచు నని సంతసించుచుంటిఁగాని, యీరాఁబోవు దుఃఖంబు నెంచనైతి. ఇంకెంత కాలమున మన నాతనిఁ జూచి సంతసించుభాగ్యము! అక్కటా! మూఢులైన శతవృద్ధు నేల కోరుకొనమైతిమి? ఆ దేవదేవుండీ వరముచే మన కెంత దుఃఖంబుఁ దెచ్చిపెట్టె—

ఉ॥ ఉల్లమునందు భక్తిమెయి • నుగ్రుని గూర్చి తపంబొనర్పఁగాఁ
బిల్లలులేని దుఃఖమును • వీఁగఁగ జేసియు, దానికంటె బి
ట్టుల్లజమైన హారితత•నూద్భవ దుఃఖముఁ దెచ్చిపెట్టెపో;
ముల్లును దీసి కొఱడచు•పోలిక నాతెఁ డిఁ కేమి సేయుదున్?

కుడిచికూర్చుండక మన మేల తపంబొనర్చితిమి? ఇట్లేల మహేశ్వరుండు వరమిచ్చె? బిడ్డలు లేనివారి దుఃఖమునకంటె బిడ్డల గని పోఁగొట్టుకొనినవారల దుఃఖము దుర్భరముగదా! జనుపాంధునకంటె నష్టనేత్రునకు విషాద మెక్కుడుగదా!

మృకం—బేలా ! ఇప్పు డిట్లు పశ్చాత్తాపపడిన ప్రయోజన మావంత యేని కలదా ?

ఉ॥ ఓ చపలాయతాక్షి ! తగునో తగదో యను చింతమాని, శ్వే
తాచలవాసుఁ డాత్మజున కప్పు డొసంగిన ప్రాయ మేఁగు నం
చేచినతాపభారమున నేడ్చిన నేమగు? పుత్రలాలనల్
నోఁచినవారి సొమ్ము లవి నోఁపనివారలకున్ లభించునే ?

ఇఁక నూరకుండుము. బాలకుండు వచ్చువేళయైనది.

మరు—నాథా! రాకాసుధాకరసదృశంబును, బ్రహ్మతేజఃపుంజీకృతంబును నగు నా బాలకుమోము దిలకింపఁగనే నిస్తులమై నిరవగాహకమైన బ్రహ్మానందము జనించు వెంటనే రానున్న యశుభంబు తలంపునకురా, నిలువునీరై పోవునంత దుఃఖము వచ్చు. ఈ దుఃఖము నతనినుండి యిం కెంతకాలము దాఁచఁగలనో తెలియకున్నది.

మృకం—గోలా! నాకుమాత్రము నీయంతదుఃఖములేదా? (నారదుఁడు పాటపాడుచుఁ బ్రవేశింప నాలకించి) ఊరకుండుము. మన పిల్లవాఁడు వచ్చుచున్నట్లున్నది.

మరు—(ఆలకించి) ఆ పాడునతఁడు మనపిల్లవాఁడు కాఁడు. ఆతఁ డింకెవరో శివభక్తుఁడు.

మృకం—అవు. నారదుఁడే !

నారదుఁడు—(శివనామస్మరణ మొనర్చుచుఁ బ్రవేశించి భార్యాభర్తలిర్వురు నమస్కరింప) కామ్యార్థసిద్ధిరస్తు! (అని దీవించును.)

మృకం—నారదా ! నీరాకచే మాగృహంబు పావనంబయ్యె.

మరు—మునీంద్రా ! మీయాశీర్వచనంబు ఫలించుఁగాత !

మృకం—మిత్రమా ! ఎన్నాళ్ళకు సెలవుగా నిటు వచ్చితివి.

నార—అమరకార్యాచరణనిమగ్నుండనై యింతకుమున్ను రాఁజాలకుంటి. కొలఁదిదినముల క్రింద మీకష్టంబుల నెఱింగి వానిఁ దుదముట్టించు నుపాయ మెఱింగింప వచ్చితిని

మృక—అట్లయిన మే మెంతయు ధన్యులము!

మరు—అక్కటా! విరించినందనా! మాకష్టము నొరులుదీర్పఁగలరా?

నార—సతీమణీ! భయపడకుము. ఆపదలకోర్చితివి. త్వరలో సంపదలఁ బడయఁగలవు. దైవ మెవరిని రక్షింపనెంచునో వారింగష్టముల పాలుసేసి పరీక్షించు. ఏడ్పించినఁగాని బిడ్డలుముద్దురారనియో యేమో? అట్టి కష్టంబులు యోగ్యులకు శుభసూచకంబులు.

సీ॥ నాఁగేలి పోటుల ♦ నలిగి వసుంధర
బహుళ సస్యాఢ్యయై ♦ పఱగునట్లు;
అగ్నికీలల నెత్తు♦తగ్గియు బంగార
మెక్కుడు వన్నె వ♦హించునట్లు;
సానరాపిడిచేత ♦ సగమయి వజ్రంబు
వరతేయు కాంతుల ♦ వఱలునట్లు;
ఱాతిదెబ్బలచేత ♦ క్రస్సి సుగంధంబు
లెక్కుడువాసన ♦ లీనునట్లు;
యోగ్యనిచయంబు కష్టంబు ♦ పొందుటెల్ల
భావికాలమ్మునం దొక ♦ ప్రబల సుఖము
బడయుటకె కాన దుఃఖమ్ము ♦ విడువుఁడింక
యోగ్యులగు మీకు దుఃఖ మీ ♦ యోజఁ దగునె?

మరు—దేవా! మీ యుపశమనవాక్యంబులు మా తాపశోషితహృదయంబుల నమృతశీకరంబులంబోలెఁ జల్లఁబఱచె. ఇఁక మాకుఁ గష్టాంబుధి దాఁటఁ దెఱు వెయ్యది?

నార—బేలా! అందులకు సందియమేల? భక్తిమార్గమే మీకుఁ దరణోపాయము. భక్తికిమించిన శక్తియు, హరునకుమించిన దొరయును లేవు. హరు నిశ్చలభక్తి సేవించు వారలకుఁ ద్రోయ

రానికష్టము లుండవు. మానవుఁడు భక్తిపూరితమనస్కుఁడై యెట్టి కార్యమునేని సాధింపఁగలఁడు.

మ॥ మనుజుం డెంతటివాఁడు దైవకృతము ♦ న్మానింప యత్నింప నం
చనుమానింపకుఁ డామహేశ్వరుఁడు త ♦ న్నత్యంతభక్తిం బ్రపూ
జనముంజేసెడు భక్తవర్యులకు వాం♦ఛాసిద్ధిఁ జేకూర్ప వె
న్వేనుఁదీయం డటుగాన మీతనయుచే ♦ విశ్వేశుఁ గొల్పింపుఁడీ.

మృకం—నారదా! అట్లే యొనర్పించుచున్నారము. మరియు నతిథులు, నభ్యాగతులుగూడ దైవసములని వారింగూడ భక్తింబూజింప జేయుచున్నారము.

నార—మిత్రమా! ఈ మహాత్కార్యమున కీపాటి సపర్య చాలదు. నిర్మలమై, నిశ్చలమై, నిగూఢమై, నిరవశేషమై, నిర్భయమై వెలుగొందు భక్తి వలయు. అయ్యది తపోవశంబునఁగాని యలవడదు. కాన నావెనువెంట మీబాలకు నంపుఁడు. నే నతనికిఁ గర్తవ్యంబు బోధించి తపోనసమేర్పఱచి భక్త్యైకవశంకరువలనఁ గామితార్థ మందఁజేసెద.

మరు—అక్కటా! ఈ బ్రతికెడు నాల్గునాళ్ళును మాచిన్నికొడుకుని మాదండ నుంచుకొనకుండ నడవులపాలు సేయుటకు మామన మెట్లొప్పు?

నార—అమ్మాయీ! ఇంకను నశుభము రానున్నదనియే భ్రమించుచున్నావా? నేఁ జెప్పి నట్లొనర్చిన నట్టిదెన్నటికిని గలుగదు. కాన యోజింపుము.

మృకం—మిత్రమా! నీమాట నిక్కువంబు. అయిన నీబేల నందుల కీయకొనఁజేయఁ బ్రయత్నించెద. [భార్యతో మంతనమాచరించుచుండ మార్కండేయుఁడు సమిధల, దర్భల చేతంబట్టి శివనామస్మరణ మొనర్చుచుఁ బ్రవేశించును]

మరు—నాథా! అదుగో! మనపిల్లవాఁడు వచ్చుచున్నాఁడు.

(మార్కండేయుడుతల్లిదండ్రులకునమస్కరించినారదునకునమస్కరింప)

నార—దీర్ఘాయుష్య మస్తు.

మార్కం—అమ్మా! నేఁ డేమి దుఃఖార్తవై న ట్లున్నావు? నేనేమైనఁ దప్పొనర్చితినా ?

ఉ॥ ఇంచుకయేనియు న్వనట ♦ నెన్నఁ డెఱుంగక ? నేను దండ కే తెంచినయంత మాత్రమున ♦ 'ధీరవిచార! కుమార! రార, ర' మ్మంచును దండకుం బిలువ ♦ కన్నా! యి దేమొకో! నేఁడుబిట్టుదుః ఖించుచునుంటి వియ్యెడలఁ♦గీఁ డది యే మొకొఁగూడెఁ జెప్పుమా!

మరు—నాయనా! ఏమని నుడువుదును ? ఇదంతయు మా గ్రహచార ఫలము. పూర్వము మేము నిన్నుఁగాంచ నీశానుఁ బ్రార్థించిన వార్త నీకుఁ గ్రొత్తకాదుగదా!

మార్కం—ఆహా! అది నాకుఁ దెలిసినవిషయమే ! అయిన-

మృకం—నాయనా! అప్పుడు సాంబశివుఁడు మాకుఁ బ్రత్యక్షమై మమ్ము దుష్టుఁడగు శతవృద్ధుంగాని, శిష్టుఁడగు షోడశవర్ష ప్రాయునింగాని గోరుకొను మనియె. మేము శిష్టుఁడగు షోడశ వర్షప్రాయునిం గోరి నిన్నుఁ బడసితిమి.

మరు—నాయనా ! ఆషోడశవర్షంబులఁ బంచాదశవర్షంబు లప్పుడే గతించినవి.

మార్కం—అమ్మా! నే నిఁకఁ జాలకాలము బ్రతుక ననియా మీ దుఃఖము ?

మరు—నాయనా! అదిగాక మాకు దుఃఖకారణము వే రేమి గలదు ?

మార్కం—అమ్మా! దీనికై నీబోంటి విదుషీమణికిఁ జింత యేల ? జన్మ విముక్తిం గాంచవలయు ననికదా వేదవిదు లుగ్గడింతురు శరీరములు నిత్యములా? పెఱుగుట విఱుగుట కొఱకేకదా! జాతస్య మరణం ధ్రువ మ్మనుట వినవా?

చ॥ తను, మిము సృష్టిఁజేసిన ది♦నంబుననే కమలాసనుం డొగిన్
మన నొసట న్లిఖించె మర♦ణంబును గాంచుట డంటంచు నట్టిచో
వనరుచుఁ దూల నేల? యొక ♦ వత్సర మిట్టులో యట్లొ యైననో
జనని! భవుండుగాక భువి ♦ శాశ్వత మయ్యెదియైన నున్నదే?

నార—భళీ! బాలభక్తాగ్రణీ! భళీ! బాగుగాఁ బలికితివి.

మృకం—నాయనా! ఈ మహానుభావుఁడు దేవర్షి యగు నారదుఁడు.

మరు—నాయనా! శరీర మనిత్యమైనను త్యాజ్యమైనను మాకొరకైన నీవు చిరాయువు గాఁ బ్రయత్నింపవలయు. నీప్రాణంబులు పోయిన మాప్రాణంబులు నిల్వ వని నమ్ము్ము.

మృకం—నాయనా! నీతల్లి చెప్పినది నిజంబు. ఈ విషయమున మా మనోభీష్టమ్ము నెఱవేర్పవలయు

మరు—నీకు సహజమైన పుత్రవిధేయత నిప్పుడ నిరూపింపవలయు.

మార్కం—తల్లీ! అట్లయిన భక్తజనమనోరథ సస్యంబులఁ బల్లవింపఁ జేయ, సఫలీకృతంబు సేయ సమర్థుఁ డగు నాపరమేశ్వరు కృపాంబు వృష్టియే నాకు శరణ్యము.

ఉ॥ తల్లి చెఱంగుఁ బట్టినను, ♦ దండ్రిపిఱుందన డాఁగినన్, దరీ
వల్లరులందు దూరినను, ♦ వారిధిఁ జొచ్చినఁ గాలమైనఁ దా
నల్లన వీడిపోవునతఁ♦డా శమనుం? డతిభక్తితో నుమా
వల్లభుపాదపద్మముల♦పజ్జన నుండినఁగాని, తల్లిరో!

నార—మిత్రమా! నీ సుతుండు భక్తాగ్రేసరుండు. భయపడక నే నుడి విన నెల్లొనర్పుఁడు.

ఉ॥ మానిజనంబు లే ఘనుని ♦ మంగళవిగ్రహదర్శనార్థులై
కానలలోఁ దపోనియతిఁ ♦ గాలముఁబుచ్చెద రట్టి పార్వతీ
జానికృపాకటాక్షము వ♦శంబొనరించి చిరాయువందఁగాఁ
గానకుఁ బంపు నావెనుకఁ ♦ గామితము ల్సమకూర నీసుతున్.

మార్కం—జననీజనకులారా! ఈ దేవర్షి వాక్యంబు నాలకించితిరిగదా! వారు సెలవిచ్చినట్లు వారివెనువెంట నన్నంపుఁడు. వారియుపదేశంబునఁ గృతార్థ చరిత్రుఁడ నయ్యెద. సంశయింపకుఁడు.

చ॥ ఎవనిసపర్యచేఁ గరము, ♦ లెవ్వని చింతనచేత మానసం,
బెవని స్తవంబుచే వదన, ♦ మెవ్వని గాంచుటచేతఁ గన్నులిం
కెవనిచరిత్రచేతఁ జెవు ♦ లెల్లెడ ధన్యతనొందు; నా యుమా
ధవుఁ గొలువంగఁ గానకు య♦థావిధిఁ బోవ ననుజ్ఞఁగూర్పుఁడీ.

మృకం—(దగ్గఱఁదీసి)నాయనా! అట్లే కానిమ్ము. నిర్మలాంతరంగుండవై నిశ్చలభక్తియుతుండవై నీహారశైలాత్మజానాథుఁబూజించి దీర్ఘాయువంది మాకడకురమ్ము. భక్తకల్పద్రుమా,గంగాధరా!

మ॥ హరిపై, నింద్రునిపై ధనాధిపతిపై ♦ నార్యామహాదేవిపై,
సరసీజాసనుపై, కృపాకరునిపై ♦ సర్వామరశ్రేణిపైఁ
బఱగఁగొల్పిన మీకృపారసము నీ♦పర్యాయమీబాలుపై
వఱలంజేసి చిరాయుఁజేయు మిక దే♦వా! భక్తచింతామణీ!

మార్కం—తల్లీ! నీవును నన్నాశీర్వదించి పంపుము.

మృకం—ప్రేయసీ! ఏల యూరకున్నావు? ఇంకను నీమనంబునకూఱట గలుగలేదా?

మ॥ తరుణీ! యేమిది యెంత చెప్పినను నీ♦దావంత మావంతయేఁ దఱుగుంబుచ్చక కుందుచుండెదవు, క♦ర్తవ్యంబు యోజింప వా, పురవిధ్వంసి పదారవిందయుగళీ♦పూజావిధిం గాక దు స్తరదుర్వారకృతాంతపాశబలముం ♦ సైరింప సామాన్యమే!

మార్కం—తల్లీ! నాకు సెలవొసంగ నీ కీభయ మేల?

ఉ॥ తాపసవర్యులెల్లరు స♦దాశివసేవయె పూర్వజన్మక
ర్మాపహృతిక్షమం బనఁ, జి♦రాయువుఁ గాంచఁగ నా కుమేశసే
వాపరతంత్రవృత్తిఁ గఱ♦ప న్మనయింటికి వచ్చినట్టి యి
త్తాపసివెంట నన్ననుపఁ ♦ దామస మేటికొనర్పఁ దల్లిరో!

నార—మారమాహాత్మ్యమునం దిట్టి యవిశ్వాసము తగునా ?

మరు—నాయనా ! పోయిరమ్ము. నీవియోగంబు నాకు జీవన్మరణమొనగూర్చు; నైన నీవుభక్తిచే గంగాధరుమెప్పించి దీర్ఘాయుష్మంతుఁడవై వచ్చెద వను నాసచే నాప్రాణముల నెట్లైనఁ జిక్కఁబట్టెద. నాయనా ! పోయిరమ్ము. నీకుఁ ద్రోవన సర్వశుభములు దోడ్పడుఁగాత! భక్తజనవశంకరుఁడగు శంకరుఁడు నీకు వశుండగుగాత ! భక్తియుడుపంబునఁ గర్మాంభోనిధిం దాఁటుదువుగాత !

చ॥ ధరణియు, లోకబాంధవుఁడు, తారలు, చంద్రముఁడెంతదాఁక సుస్థిరముగ నుందు రందనుక ♦ శ్వేతనగేశు కృపాంబువృష్టి దుస్తరమగు కర్మ నీరనిధి ♦ దాఁటి చిరాయువుఁ గాంచి యామహేశ్వరు నురుభక్తవత్సలతఁ ♦ జాటుచు నుండెదుగాతఁ బుత్రకా.

నార—మార్కండేయా! ఇఁకరమ్ము. (మార్కండేయుఁడు తలిదండ్రులకు నమస్కరింప నాతనిహస్తంబుఁ గొని) మిత్రమా ! పోయి వచ్చెదము భయమువదలి సుఖంపుఁడు. (నిష్క్రమించును)

మరు—హా! పుత్రా! పోయితివా? (మూర్ఛిల్లు. మృకండుఁ డుపచారము లొనర్చుచుండ యవనిక పడును )



## పంచమరంగము.

స్థలకము : రాజమార్గము.

(నారదుఁడు మార్కండేయ సహితుఁడై ప్రవేశించును.)

మార్కం—మునీంద్రా ! మన మనేకపుణ్యతీర్థముల సేవించి, పుణ్యపురుషుల యాశీర్వచనము లంది గోదావరీతీరముఁ జేరనుంటిమి కదా! ఇఁక నాకుఁ గర్తవ్యమెద్ది ?

నార—మార్కండేయా! ఆవిషయమై యింక నుడివెద వినుము.

మ॥ సరసీజాసనుతోడ నీచరితఁ బ్రస్తావింప నాతండు. శం
కరుఁడే షోడశవత్సరాయువు నొసంగన్ వాని కాయుష్యమున్
బరుఁ డెచ్చింపఁగఁజాలఁ డాకతమునన్ బ్రాయాభివృద్ధ్యర్థమై
హరునే వేఁడఁగఁజేయు మం చనియె నీవా చాయనే సల్పుమా.

మార్కం—అట్లే యొనర్చెదను.

నార—ఈప్రాంతమున నొక తపోవనంబుఁ జూపెద. అందు వసించి యాభావాతీతుని, గుణాతీతుని బరమేశ్వరుఁ గూర్చి తపంబొనర్పుము. అతండు భక్తవత్సలుండు. భక్త్యేకవశంకరుఁడు. కావున భక్తితో నాతని గొల్చిన నీ కోరిక యీడేఱు. సూచిక అయస్కాంతంబును, సాధ్వి నిజవిభుని, లత క్షితిరుహంబును, సింధువు సరిద్వల్లభుని దగిలి నిత్యంబుఁ జరించునట్లు మనోవృత్తి సర్వకాలముల సర్వావస్థలఁ బరమాత్ము చరణకమలములఁ దగిలి యుండుటయే భక్తి యని పెద్ద లంద్రు. తల్లి పిల్లనుంబోలె భక్తి భక్తు ననారతంబుఁ గాపాడు. ఆభక్తిమాహాత్మ్య మత్యద్భుతము అనిర్వాచ్యము. అజ్ఞేయము. అగాధము. అనన్యశరణ్యము దానిమూలమున సాధింపరానిది లేదు. దానిమూలమునఁ గాక వేఱుసాధనమున నీకోర్కె లీడేఱవు.

సీ॥ సర్వేశ్వరుం డగు శంభుఁ గింకరుఁ జేయ
ధన మున్న దే భక్తిధనము గాక;
సర్వోపగతుఁ డగు శర్వు బంధింపఁగ
బలమున్న దే భక్తిబలము గాక;
సర్వజ్ఞుడైన వృషధ్వజు మెప్పింప
విద్యయున్నదె భక్తివిద్య గాక;
సర్వభోక్తను మహేశ్వరుఁ దనియించెడు
ఫల మున్న దే భక్తిఫలము గాక;

సర్వవరదుండైన ♦ శంకరుం జేరంగ.
బథముగలదె భక్తి ♦ పథముగాక,
కాన భక్తియోగ ♦ మూని కామ్యార్థంబు
నందుమయ్య బాల ♦ కాగ్రగణ్య!

మార్కం—మునీంద్రా! త్రికరణశుద్ధిగా నట్లేయొనర్చెద ఇంకనాశ్రమ మేఁగుదమా?

నార—అట్లే! (కొంతనడిచి) మార్కండేయా! అదిగో! నీతపోవనము. అదిగో! యమృత కంఠేశ్వరలింగము. అచ్చటఁ జేరి లింగము నర్చించి దీర్ఘాయు వందుము. ఇంక నేఁడు దినములలో నీ కీశుఁ డొసఁగిన యాయుష్కాల మంతరించు. ఈలోపల నీ భక్తిచే నికార్యంబును సాధింపవలయు. ఇంక నచ్చటి కేఁగుము. నేను దేవలోక మరిగెద.

మార్కం—దేవర్షి చంద్రా! మీరు నుడివిన ట్లొనర్చెద. ఇంక నాకు సెలవా?

నార—

మ॥ జనకుండై, జనయిత్రియై, పురుషుఁడై ♦ సర్వార్థసంధాతయై,
ఘనదైవం బయి. విద్యయై, గురువునై ♦ గంగావతంసుండు కా
యునికారిం బడకుండ నిన్గరుణ నా ♦ లోకించి, భక్తప్రజా
వనదీక్షారతిఁ జాటుఁగాత మిల నా ♦ భానవ్యబ్జతారంబుగాన్.

(మార్కండేయుఁడు నమస్కరించి నిష్క్రమింప) కానిమ్ము. ఇంతవఱ కంతయు నెఱవేఱినది. ఇంక వారము దినములలో నా వాంఛితము సిద్ధించు. (నిష్క్రమించును)

# భక్తమార్కండేయ

## తృతీయాంకము

### ప్రథమ రంగము.

స్థలకము : గోదావరీప్రాంతభూమి - అమృతకంఠేశ్వర లింగము

(మార్కండేయుఁడు పూజాద్రవ్యంబులఁ దెచ్చి పూజించును)

మార్కం—దేవదేవా! మీయాశ్రయమునకు సమాన మీ సృష్టి యందుఁ గలదా ?

సీ॥ పాదపచ్ఛాయలు ♦ పథికశ్రమను బాపు
హర్మ్యంబు వృష్టిభ♦యంబుఁ బాపు
ధార్మికుం డగు రాజు ♦ దారిద్ర్యమును బాపు
గృహమేధి భోజన♦స్పృహను బాపు
ఆచార్యశేఖరుం ♦ డజ్ఞానమును బాపు
బంకజాప్తుఁడు తమోబాధఁ బాపు
ఉడుపంబు లహరీభ♦యోద్వేగమును బాపు
వస్త్రంబు శీతభ♦యంబుఁ బాపు
కాని మానవులకు నైజ♦మైన సర్వ
సాధ్వసాశార్తులన్ను బాపఁ♦జనునె, నీదు
నాశ్రయమ్మునఁగాని య♦న్యాశ్రయమున ?
భక్తమందార, పావన♦పథవిహార !

ఈదినమె నీవిచ్చినగడువు దీరిపోయె. ఇప్పుడే నీభక్తవాత్సల్యమును సంపూర్ణముగా నాయెడఁజూపి నన్నీ రానున్న మృత్యువును గెల్వనీయవలయు, అదుగో ఎవరో వచ్చుచున్న ట్లున్నది.

మృత్యుమృత్యుస్వరూపా! మృత్యుసంసార ఖండనా! మృత్యు బీజా! మృత్యురీశా! మృత్యుంజయా!

(యమకింకరులు పాశహస్తులై ప్రవేశింతురు.)

అదుగో యమకింకరు లిప్పుడే వచ్చిరి. దేవా! ఇప్పుడే నీభక్త వాత్సల్యము, భక్తకామ్య సంధాయకత్వంబు గనుపింపవలె. (దగ్గఱఁ జేరి చేతుల మోడ్చి)

సీ॥ ప్రోచినాఁడవుగదా! ♦ పురవినాశ మొనర్చి
విష్టపత్రయమును వేదవేద్య!
ఆదుకొంటివిగదా! ♦ హాలాహలముఁ ద్రాగి
బృందారకౌఘంబు ♦ విశ్వనాథ!
కాచినాఁడవుగదా! ♦ గంగను సిగఁ దాల్చి
భక్తు భగీరథుఁ ♦ బరమపురుష!
చేదుకొంటివిగదా! ♦ సేనానిఁ జేకూర్చి
నాకాధినాథు న♦నాథనాథ!
ఇంక నెందఱినో కృత♦నేలినాఁడ
వౌట కాలకింకరుల భ♦యంబుఁ బాప
దోడునీడఁగ వచ్చి సం♦తోషపఱుపఁ
గష్టమా, నష్టమా? కరు♦కంఠ! నీకు.

(యమకింకరు లొండొరుల ముఖంబులఁ జూచుకొని మార్కండేయభక్తి కచ్చెరువందుచు)

1 కిం—భక్తాగ్రణీ! భక్తాగ్రణీ!

మార్కం—ఎవరు మీరు? న న్నేల పిలిచెదరు?

2 కిం—మేము యమభటులము. నీకొఱకై వచ్చితిమి.

మార్కం—ఏమీ? మీరు యమకింకరులా? మీ రీ పవిత్రప్రదేశంబు కేల రా సాహసించితిరి?

1 కిం—బాలకా! మాకుఁ జేరరానిచోటులు చతుర్దశభువనంబులం గలవా? నీకుఁ బరమేశ్వరుఁ డొసఁగిన పదునాఱేండ్లు నేఁటితోఁ దుదముట్టె. కావున మారాజునాజ్ఞచే నిన్నుఁ గొంపోవచ్చితిమి. కనుక నా శివలింగము ప్రాపు వదలి రమ్ము.

మార్కం—నేను మీ వెంటవచ్చువాఁడఁగాను. మీరు వచ్చినత్రోవను బొండు.

2 కిం—అయ్యా! నీవు భక్తుఁడవు. పాప మెఱుఁగనివాఁడవు. కావున మేము విమానముఁ దెచ్చితిమి. దాని నెక్కి యమసదనమునకు రమ్ము. తర్వాత మీపుణ్యమునకనువగు స్వర్గమునకో, కైలాసమునకో పోయి కాలంబు గడుపుదువు.

మార్కం—కింకరులారా! నే నింకను నీభూమిపై మనవలె నని కుతూహలపడుచున్నవాఁడ. కావున మీరు విమానముఁ దెచ్చినను నేను రాను పొండు!

1 కిం—ఏమయ్యా! మేము సాంత్వనవాక్యంబు లాడుకొలది మమ్మలక్ష్యము సేయుచున్నాఁడవు. ఇది నీకుఁ దగదు. దీనివలన నీకు వృథా ప్రయాసయే కాని ఫలము లేదు.

మార్కం—కింకరా! నా ప్రయాసము వితథమో, ఫలవంతమో క్షణములోఁ దెలియు.

2 కిం—నీవిట్లు మాఢ్యమూనిన నిన్ను బలవంతముగాఁ బాశబద్ధుఁ జేసి తీసికొనిపోయెదను సుమా!

మార్కం—కానిండు. ఈశుం డెక్కుడో, మీపాశం బెక్కుడో చూతము?

1 కిం—(రెండవవానితో) రక్తముఖా! వీనితో మనము మాటాడి గెలువలేము. ఇఁకఁ బనికిదిగుదము. ఏదీ! నీపాశమును వేయుము (2వ వాఁడట్లొనర్పఁ బాశంబు మార్కండేయుని దప్పి పడును. 1వవాఁడుగూడ నట్లొనర్చియుఁ బ్రయోజనంబుఁగానక మార్కం

డేయుఁ డాసి పట్టుకొన ముందునకేగ మంటల మాడి వెనుకకుఁ బరుగెత్తుదురు.)

మార్కం—దేవా !

ఉ॥ ఎంచఁగరాని భక్తజన•బృందముల న్మనుమున్న సత్కృపా
భ్యంచితమానసంబున ర•యంబునఁ జేకొని వన్నెవాసి నా
ర్జించిన మీ కుమేశ! యిటఁ • జెల్లునె బాలకు భక్తవర్య పాి
పంచిక సౌఖ్యకామ పర•బాధితుఁ బోవఁగఁ దామసించుటల్.

(కింకరులు పరుగెత్తుటఁ గాంచి)

తృప్తోస్మి, తృప్తోస్మి! దేవా! నీదయ నాయెడఁ గనుపించితి వా? ఇఁక నే ధన్యుఁడనైతి.

1 కిం—బాలకా! మమ్మఁ బాఱఁదోలితివని తుళ్ళిపడకుము. ఇల్లలి కినఁ బండువు గాదుసుమా !

2 కిం—మా రాజగు దండధరుని బంపెదము. అప్పుడు ని న్నెవఁడు రక్షించునో చూతము

మార్కం—రానిమ్మ. నిన్ను, నన్ను, అతనిని రక్షించు నాజగద్రక్షకుఁడే రక్షించు. ఇఁక మీ కాలికిం బుద్ధి సెప్పుడు. ఈ పుణ్యక్షేత్రమున మీబోంట్లు కాలూనరాదు.

1 కిం—మాటలకేమి? యమధర్మరాజు వచ్చిన నీమాటలపాటవము దెలియునులెమ్మ !

మార్కం—ఓరి మూర్ఖులారా! జగద్రక్షకుఁడు నాపాల నుండ మీ యముఁ డన్న భయ మేలరా ?

మ॥ అనలం బమ్ముగ, వెన్నుఁ గోలఁగ, హిమా•హార్యంబు చాపంబుగా,
ఫణిపున్ మౌర్విగ, భూమి స్యందనముగా,•వాణీధవున్ సూతుఁగా,
మినుకుల్ వాజులుగాఁ బురత్రయము సం•భేదించి దేవాళిఁ గా
చిన గంగాధరుఁ డుండ నంతకుఁ డనన్ • జింతింప నాకేటికిన్.

మ. స్ర॥ ఇంద్రముఖసురాభివందితు, నిష్టకామితదానని
స్సంద్రు, హైమవతీసనాథుని, సర్వపాపవినాశకృ
త్సాంద్రకీర్తికలాకలాపుని, సజ్జనావనకామునిన్,
జంద్రశేఖరు నాశ్రయించెద జంక దేల యముండనన్?

మ॥ గహనంబందున, గేహమధ్యమున, సంగ్రామాంబునన్, గ్రామమం,
దిహమందుం, బరమందు లేక మఱి యెందేనిన్ బ్రకాశంబునం
గుహనాత్మోఘము ద్రుంచి, భక్తజనులం గొండాటమైఁ బోచునా
తుహినాంశుప్రతికర్ముఁ డుండ జముకై దుఃఖింప నాకేటికిన్
ఇఁకఁబొంకు. (యమకింకరులు పరువెత్త యవనిక పడును)



## ద్వితీయ రంగము

స్థలము : యమపురము – సంయమనీనగరము

(చిత్రగుప్తుఁడు తదేకధ్యానంబుగా బ్రాణుల పుణ్యపాపంబుల వ్రాయుచుండు.) వేత్రహస్తులు 'సకల జంతు సంతాన సుకృత దుష్కృత వ్యవహార పరిశీలనా! వజ్రవైఢూర్య గోమేధికపుష్యరాగమరకత మాణిక్య ఖచిత సింహాసనాసీనా! భానువంశాంభోధిసోమా!' అని పరాకులు సేయ యముఁ డరుదెంచి చిత్రగుప్తునిచే నమస్కారమంది సింహాసనాసీనుఁడై)

యము—సేవకా! కింకరులు జీవులం దెచ్చి ద్వారమున వేచియున్నారా?

సేవ—దేవా! అట్లే వేచియున్నారు.

యము—ఒక్కొక్కరిని లోనికిఁ గొని రమ్మనుము.

సేవ—చిత్తము! (పోయివచ్చి) దేవా! ద్వారమున వారికి మున్మున్న నారద మునీంద్రులు వచ్చుచున్నారు.

[నారదుఁడు ప్రవేశింప యమాదులు వారికి నమస్కరించి యాశీస్సుల నంది]

యము—విధినందనా! యీ యాసన మలంకరింపుఁడు. మీ రాకచే మా లోకము పావనం బయ్యె. మాజన్మము ధన్యమయ్యె.

నారద—శమనా! నేను మున్నొకసారి వచ్చి నీ న్యాయపరిపాలనముం దిలకించి నీ ప్రభావము నాలోకించియుంటిని మఱల వానిఁ గన వచ్చితిని.

యము—బాగుబాగు! అట్లైన మీరు మంచితరుణముననే వచ్చితిరి. సేవకా! కింకరుల రానిమ్ము—

(1 కింకరుఁడు 1 జీవిని ముందునకు నెట్టును.)

చిత్రగుప్తా! ఈతని విషయ మేమి?

చిత్ర—(లేచి, గ్రంథము వెదకి) ఈతండు సద్వంశసంభూతుండయ్యు సద్గుణగణవిభూషిత యగు విద్రుమోష్ఠిని భార్యగాఁ బడసియుఁ బరకాంతాసంగమమే కోరెను, గుడ్డయుగాఁ గలకాలంబుఁ బుచ్చె. ఇతనిపాపము పుణ్యముకంటె వేయిమడుంగు లధికము

యము—ఏమీ! పరకాంతల తల్లులవలెఁ జూడవలయు నని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచుండ నీతఁడు మదాంధుఁడై విరుద్ధ ప్రవర్తనుఁ డయ్యెనా? కానిమ్ము!

చ॥ గురుతరసౌఖ్యసంపదలఁ ♦ గూర్పఁగ, మున్మును వహ్నిసాక్షిగాఁ
బరిణయమాడినట్టి కుల♦భామను వీడి, పరాంగనాగృహాం
తరములఁ బ్రొద్దుపుచ్చిన య♦ధర్మచరిత్రుని వీనినిం దమో
నరకమునన్ దివానిశము♦నాక కలంచుఁడు వేయివర్షముల్.

1 కింక—దేవా! మీయాజ్ఞశిరసా వహించెదను. జీవిఅయ్యోఅయ్యో యని మొఱవెట్ట నెట్టుకొనిపోవును. రెండవకింకరుఁ డింకొక జీవితోఁ బ్రవేశింప)

చిత్ర—దేవా! ఇతఁడు వైశ్యుఁడు. ఇంద్రప్రస్థపురనివాసి. ఇతని ముఖ్యమైన పాపము హరినామమును స్మరింపక ధనమునే యిహ

పరసాధనముగఁ దలంచి యందులకై యన్యాయమార్గముఁ ద్రొక్కుట. అతనిపాపము పుణ్యముకంటెఁ గోటిమడుంగులెక్కువ.

యము—ఏమేమీ! ధనార్జనాలోలుండై దైవచింతనమును, ధర్మమార్గమును రెంటిని వదలెనా? ధూర్తా! నీవు రెంటికిఁజెడిన రేవఁడవైతివి.

మ॥ హరినామస్మరణంబె మర్త్యులకు జన్మాంభోనిధిం దాఁటఁగాఁ
దరణోపాయ మఁటంచు నెల్లడల శాస్త్రజ్ఞుల్ ప్రబోధించు నో
సంకుం జేయక ధర్మమార్గముల నైశ్వర్యార్జనోత్సాహియై
హరి సేవింపని వీని రౌరవమునం దార్వేయుఁడొండ్లు చుఁడీ.

(2 వ కింకరుఁడు వాని నెట్టుకొనిపోవ, నవల 1 వ కింకరుఁడింకొకని దోడ్తెచ్చి)

చిత్ర—దేవా! ఇతఁ డయోధ్యాపురవాసి. సన్న్యాసాశ్రమము స్వీకరించిన బ్రాహ్మణుఁడు. సర్వంబును వదలి హరినామ స్మరణంబె తారకంబుగాఁ దలఁచి జీవితంబును గడపె ఇతని పుణ్యము పాపముకంటె వేయిమడుంగు లధికంబు.

యము—ఇట్టి పుణ్యాత్ములుగదా సర్వజనసంసేవ్యులు! స్వర్గవాసార్హులు! ఈతని విమానమందుంచి స్వర్గలోకంబునకుఁ గొంపొవుఁడు. నారదమునీంద్రా! ఈచిత్రింబుఁ జూచితివా హరిని గోరిన సిరిని గోరరు సిరిన గోరిన హరిని గోరరు.

శా॥ శ్రీవిశ్లేషము దుర్భరం బని యురస్సీమ న్నివాసంబుగా
నా వాల్గంటి కొసంగినట్టి హరి సంప్రార్థించి శ్రీవేడ, కా
శ్రీ వాంఛించి రమామనోరమణునిన్ సేవింప, కీమానవుల్
దావంతంబున ముంచుచుండెదరు పో దామోదరున్ నారదా!

నార—సూర్యనందనా! నీ మాట నిక్కువంబ.

యము——తరువాత - (కింకరులు వణకుచు నూరకుండ) ఏమిరా! అది? అట్లు మాటాడఁ దబ్బిబ్బుపడుచున్నారు మీయాచర్య యద్భుతముగా నున్నదే?

చిత్ర——దేవా! తర్వాత రావలసినది మృకండుసూతి. నేఁటియుదయముతో నాతనికి హరుఁ డిచ్చిన పదునాఱేండ్లప్రాయము దీఱెనని పీడించి దెమ్మని పంపితిని.

యము——తెచ్చిరా? లేదా? (కింకరులు చేతులు తిఱుగవేయ)ఏమిరా! ఎందులకు మీరా మార్కండేయుఁ దీసికొనిరాక వచ్చితిరి? చెప్పుడు.

1 కిం——దేవా! మే మేమి చెప్పుదుము? గుండులు తేలి బెండులు మునుంగుకాలము సన్నమైనది. ఇంతకుమున్ను జీవులుమాదర్శనమాత్రంబుననే దేహము వదలి వచ్చుచుండెడివారు. ఇప్పుడీ మార్కండేయుఁడు మమ్ము లెక్కింపఁడయ్యె. మే మాతని బలవంతముగాఁ గొని తెత్తమని యత్నింప మహేశ్వరుమహత్వంబున మంట లుద్భవించి మమ్ముఁ గాల్చె. ఇవిగో గాయములు. ఇంతేఁ బోక నతఁడు మిమ్ము పలువిధముల దూషించి మీరాజుతోఁ దెల్పుకొమ్మనియె.

యము——

శా॥ ఏమేమీ!నరమాత్రుఁడొక్కరుఁడు మా♦భృత్యౌఘముల్ బిల్వమమ్మేమో తెగనాడి మాజనములన్ ♦ హింసించెనా? వేగమే మామాహాత్మ్యము నెల్లలోకముల నిం♦పన్ వాని బంధింపఁగా మేమే పోయెదమింక వాని నెటు లా♦మృత్యుంజయుం డోమునో? ఇఁక వీనినివదలిన లోకంబున యముఁడన్న భయముదొలంగు.

నార——శమనా! దైవభక్తులు సాధింపలేని కార్యమున్నదా! ఊరక యా హరభక్తాగ్రేసరుజోలికిఁ బోయి పరాభవ మందకుము. ప్రాణములఁ బోగొట్టుకొనకుము.

శా॥ ప్రాలేయాచలకన్యకాధవు కృపా♦వాల్లభ్య సంపాదన
వ్యాలోలాత్ము మృకండునందనుని గ♦ర్వారంభసంరంభివై
ఏలా చంపఁగ సాహసింప, శమనా! ♦ మృత్యుంజయుండార్తర
క్షాలోలుం డని నీ వెఱింగిన నిటుల్ ♦ గర్వించి భాషింతువే.

యము—నారదమునీంద్రా! మీరు నాప్రభావమెఱుంగక పలికెద రేల? ఎవరైన నాకేమి? పూర్వసంచితకర్మంబు దాఁటు ధీరుఁ డీలోకములఁ గలఁడా? నీడ దాఁట శక్యమగునా? భక్తుఁడైన వేఱొకజన్మంబున ఫలంబులందుఁగాక! ఈజన్మంబున నయ్యది సాధ్యమా?

నార—యమా! హరభక్తులజోలికిఁ బోకుము. శుభంబు గాదు.

కం॥ తనయెడ నపరాధంబులఁ
బొనరించిన జనునినైనఁ ♦ బ్రోచును గానీ
తనభక్తులఁ గారించిన
జనులను మననీయఁ డద్రి♦జాపతి శమనా!

యము—నారదా! నన్ను బెదరించెదవా? హరభక్తుఁడైననేమి? హరిభక్తుఁడైననేమి? అందఱు కర్మబద్ధులే కదా! నాప్రభావముఁ జూడవలయు నన్న నావెంట రమ్ము. నే నిదే పోవుచున్నాఁడ.

నార—శమనా! నీత్రోవన నీవేగుము. నేను నిన్నుం గలిసికొనియెద.

యము—చిత్రగుప్తా! నే భూలోకమేఁగి సత్వరముగా మార్కండేయుఁ బట్టి తెచ్చెద. అందాఁక నీ విచారణ మాపియుంపుము. రా! నారదా! రమ్ము. (నిష్క్రమింతురు)



## తృతీయరంగము.

స్థలకము : గోదావరీ ప్రాంతభూమి, అమృత కంఠేశ్వరలింగము.

(మార్కండేయుఁడు పూజించుచుండును.)

మార్కం——దేవా! నిన్ను నమ్మినవారల యపాయములు పటాపంచలై పోవునుగదా !

కం॥ అంబుధి కుల్యంబగు, సిం
హంబు కురంగంబగు, విష ♦ మమృతం బగు, శై
లం బల్పోపల మగు, నన
లంబు జలంబగు తవకృప ♦ లభ్యంబైనన్.

(యముఁడు మహిషవాహనారూఢుఁడై, పాశహస్తుఁడై ప్రవేశించి, వాహనము డిగి వచ్చి)

యము——

ఉ॥ దండధరానుజీవుల వః♦దంబున దేహ మెఱుంగ కొక్క యు
ద్దండనిభంగిఁ బట్టుకొని ♦ దండితులం బొనరించినావె మా
ర్కండ! త్వదీయగర్వమును ♦ ఖర్వముగా నొనరింపఁగా నిదే
దండధరుండ వచ్చితిని ♦ తప్పక నిన్గొనిపోదుఁ జూడుమా.

మార్కం——(యముని గాంచి వడఁకుచు లింగముదండఁ జేరి) మహాదేవా! దీనబంధూ!

సీ॥ భక్తజనావనా♦బద్ధకంకణహస్త !
కాపాడఁగా నన్నుఁ♦గాల మిదియ
అహితదుర్వార గ♦ర్వాంధ విదారణ !
సంరక్షణము సల్ప ♦ సమయ మిదియ
హిమశైలపుత్రికా ♦ హృదయాబ్జబంభర!
త్రాణంబు గావింపఁ ♦ దరుణ మిదియ
సకలాగమైక ప్ర♦శస్త పవర్తన !
సదయతఁ జూపఁగా ♦ నదను నిదియ

కానఁ గాలునిచే బాధఁ♦గాంచనున్న
నిన్ను నమ్మినవారిని ♦ నీదుభక్తుఁ
డోడునీడగ వచ్చి సం♦తోషపఱుపఁ
గష్టమా, నష్టమా, కఱ♦కంఠ! నీకు.

యము—బాలకా! వృథా కాలయాపన మొనర్చెద వేల రమ్ము. నా వెంట రమ్ము.

చ॥ వనరుహనాభధాతృసుర♦వర్యులు దాటఁగ లేనికర్మ నే
యనువున నీకు దాఁటనగు ♦ నర్భక! యింతటనైన నాదుమా
టను విని నాపిఱుందన హు♦టాహుటి వచ్చెదు నాఁడ వేని, ని
న్నని పెద నాకలోకమున ♦ కంచితసౌఖ్యసుధాబ్ధిఁ దోఁగఁగన్.

మార్కం—పరేతరాజా! కర్మముకర్మమని పెద్దఁజేసి పల్కెదవు. భక్తిచే సాధింపరానికర్మము లేదను మర్మ మెఱుంగ వైతివిగదా? ఈ మృత్యుంజయుండే నన్ను నీబారినుండి రక్షించి నా కీకర్మనీరనిధి దాఁటఁదోడగు.

యము—బాలకా! నీవు పొఱఁబడుచున్నావు భక్తిచే భవిష్యజ్జన్మంబున శుభంబుఁ బడయవచ్చు. కాని పూర్వజన్మంబునఁ జేసిన పాపఫల మీ జన్మంబున నవశ్యము భోక్తవ్యము.

మార్కం—ధర్మరాజా! ఇదియేనా ని ధర్మవిజ్ఞానము.

యము—బాలకా! మఱియు భావిశుభంబులనందనైన హరుని, బద్మాసనుని మున్నగువారలఁ గొలిచినఁ బ్రయోజన ముండును గాని యాస్థాణువును, నాదిభిక్షుకుని, నర్ధనారీశ్వరుని, శ్మశానావాసుని గొల్చిన నేమగు ?

మార్కం—సూర్యనందనా! ఏమి నీ యజ్ఞానము!

ఉ॥ ఆవనజాక్షుఁ డాతపసుఁ♦డావనజాసనుఁ డాబిడౌజుఁ డా
దేవత లీపురాంతకుని ♦ దివ్యమహత్త్వసుధాంబువృష్టిచేఁ
బావనులై తరించుగతి ♦ భావన సేయక, యీశు, భక్తసం
భావనకే యనర్హుఁడని ♦ పల్కఁగ నీ కెటు నాల్క యాడెనో.

యము——బాలకా! నీ వెంత నాపినాకపాణిఁ బెద్దచేసిపల్కినను నాతని యవగుణంబులు లోక మెఱుంగదా?

సీ॥ అమృతాంశుశేఖరు ♦ నకలంకచరితకు
దారుకావనకుంజ♦తటమెసాక్షి
ఆర్యాసనాథు భ♦క్తావన శక్తికి
బాణాసురుని పరి♦భవమెసాక్షి
అసమలోచనుని బా♦హావిక్రమమునకు
నర్ధనారీశ దే ♦ హాంశె సాక్షి
కఱకంఠు సర్వలో♦క ప్రభుత్వమునకు
శవదహనోర్విహా♦సంబె సాక్షి

ఇంతమంది సాక్షు ♦ లీశానుఁ బూజింప
వితయఁటంచును జడి♦పెట్టుచుండఁ
దెలిసి తెలియ కిట్లు ♦ చలపాదితనమునఁ
గలఁగనేల కో మృ♦కండుతనయ!

మార్కం——శమనా! శర్వుఁ బూజించువారు బేలలయిన లోకమున నట్టి వా రనేకు లున్నారు. నేనొకండఁగాను. మఱియు శివుని నమ్మి చెడినవారును లేరు.

సీ॥ శర్వుని స్తుతియించి ♦ చక్రింబుఁ గాంచిన
మాపతి నాకంటె ♦ మఱియుఁ డొక్క-
భర్గుని శరణొంది ♦ బ్రతుకు తెఱవుఁ గన్న
పరమేష్టి నాకంటె ♦ మొఱకుఁ డొక్క-
ఈశాను మెప్పించి ♦ యింద్రత్వముం గన్న
మఘవుండు నాకంటె ♦ మందుఁ డొక్క-
అభవు నభ్యర్థించి ♦ యమృతంబునుం గన్న
యమరులు నాకంటె ♦ నజ్ఞు లొక్క-

అట్టిధీరులై హరు ♦ నర్చించుచో వానిఁ
బోతరించి నిన్నుఁ ♦ బోలువాఁడ
నాదరించు టది 'వి♦నాశకాలే విప
రీతబుద్ధి' యనెడు ♦ రీతిగాదె?

కావున శైవద్వేషము వదలి, శివభక్తిమాహాత్మ్య మెఱింగి పల్కుము. లేనిచో—

యము—బాలకా! ఇఁక నీమాటలు కట్టిపెట్టుము. శివుఁడు నా ముందట నెంతటివాఁడు. నీవు వచ్చెదవా? లేదా? లేనిచో నిన్నును నీ శివుని నా పాశమున బంధించెద.

మార్కం—అంతకా! నీ కంతము దాపరించినది. ఇఁకనైన నామాట విని వచ్చినత్రోవను బొమ్ము, శివభక్తుల దూరముగా వదలి పొమ్ము.

మ॥ హరధిక్కారమొనర్చుచుండి, హరభ♦క్తౌఘంబు గాఱించి శ్రీ
ధరుఁడైనన్ వనజాసనుండయిన యు♦క్తప్రక్రియన్ వీతమ
త్సరులై పోయెఁ బువార లిఁకయిన నీ ♦ఘుంఘుమాటమున్నాని, భా
స్కరపుత్రా! శివభక్తు వీడి చనుమా ♦ శౌర్యంబుఁ బోనాడుమా

మ॥ నినుఁ బుట్టించిన భారతీరమణుఁడున్ ♦ నిన్నన్న సప్తాశ్వుఁడున్,
నినుఁ జేకొన్న సరోజనాభుఁడు భవా♦నీనాథుఁ డన్నన్ మహా
వినయస్ఫూర్తినిఁ గేలుమోడ్చెదరు గ♦ర్వింపంగ నీకౌనొకో!
యినపుత్రా! శివభక్తు వీడి చనుమా ♦ యీర్ష్యాళుత స్వీడుమా!

మ॥ ప్రమథాధీశ్వరుఁ డాదరింపఁడని కో♦పంబూని దక్షుండు, య
జ్ఞము నొక్కండశివంబుగా సలుప సం♦కల్పించి గీర్వాణబృం
దముతో నాపదలందియుం బెట్టేఁగెయు ♦ స్దర్పింప నీ కేటి కో
శమనా! శంకరభక్తు వీడి చనుమా! ♦ శౌర్యంబుఁ బోనాడుమా!

యము—ఓహో! శ్రుతిమించిరాగమునఁ బడుచున్నదే? ఓరీ! ధూర్తా! కానీ చూత మాహరుఁ డెట్లు నిన్ను రక్షించునో? (పాశమును విదలింప)

మార్కం—దేవాదిదేవా! పురాణపురుషా! ఇప్పుడే నీమాహాత్మ్యమిట్టి మూర్ఖులకుఁ జూపవలయును. ఇంక నూఱకుంట తగదు. కుట్టక యుండు తేలును గున్నురపుర్వని గేలి సేయునట్లు నిన్ను బడుగ ని, భక్తవాంఛిత మీఁజాలనివాఁ డని యందురు. రక్షింపుము.

యము—ఇదిగో! కాచికొనుము. (పాశమును ద్రిప్పి మార్కండేయు నకు లింగమునకుఁ జుట్టి లాగును)

మార్కం—హా! జగద్రక్షకా! భక్తత్రాణపరాయణా!

శా॥ ఈవై వస్వతుఁ డాత్మపాశమున నన్ ♦ హింసించుచోఁ బ్రాణముల్
తావుల్ దప్పెను, మేనుశోష్మసిలెడున్, ♦ దాపంబు రెట్టించెడున్
నీవే దిక్కని నమ్మినాఁడ నిఁకనేన్ ♦ నీహారశైలేశ! వే
రావే పాలనసేయవే మనుపవే ♦ రక్షింపవే భక్తునిన్.

(లింగముఁ బగుల్చుకొని శివుండు ప్రత్యక్షమై యముని శూలంబుతోఁ గూలఁద్రోసి మార్కండేయున కభయహస్త మొసంగ)

—♦ దండకము ♦—

జయజయ జగదేకరక్షామణీ! దేవచూడామణీ! సర్వబృందారక శ్రేణిసంపూజితాంఘ్రిద్వయీఫుల్లనీ రేరుహా! భక్తసంవ్రాతసంప్రార్థితాఖండవాంఛాప్రదానామరోర్వీరుహా! హారనీహారకర్పూరడిండీరమందార గోక్షీరతారావళీ చారుతాభారసంకాశకీర్తిద్యుతీ! క్షీరవారాశిసంజాత హాలాహలాస్వాదనాదిత్యసంఘూద్భృతీ! శీతశైలాధినాథాత్మజాతోరువక్షోరుహ ద్వంద్వలిప్తాంగరాగప్రభాదీప్తబాహాంతరా! వాలఖిల్యాదిమానీంద్రసంఘాతచిత్తాంబుజేందిందిరా! సర్వసర్వంసహాగేయ! మృత్యుంజయా! నీ మహాఖ్యానమున్ శ్రీశ, వాగీశ, భోగీశ, దేవేశులున్ వర్ణనం జేయగానేర రేనెంతవాఁడన్, మహామూఢుఁడన్, బాలుఁడన్, మర్త్యుఁడన్ నీవు కారుణ్యభావంబుతోఁ గాలు శిక్షింపఁగా నన్ను రక్షింపఁగాఁ జేయుటం జేసి నేధన్యతంబొందితిన్ కామ్యముంగాంచితిన్, గీర్తిం జెందితిన్, నీసుమూర్తిన్ బ్రపూజించు నీయంఘ్రియుగ్మంబు సేవించు నీగాథలాకర్ణనం జేయు, నీపూజ్యనామంబు ధ్యానించు భక్తాళికిన్ గోర్కులీడేఱవే!

దుఃఖము లీడవే? సౌఖ్యము లీడవే? సాలోక్య సారూప్యసామీప్య సాయుజ్యము లిడవే? దేవ! వేయేల? మీకంటెఁ బూజ్యుండు, మీ కంటె సేవ్యుండు, మీకంటె వంద్యుండు, మాన్యుండు, ధ్యేయుండు. దేవావనీ దేవలోకంబుల నెల్లఁ డీనైఖరి నన్ను స్వతంత్రంబు నీభృత్యుఁగా, శిష్యుఁగా, భక్తుఁగాఁ జేసి రక్షింపుమా, కావుము, ప్రోవుమా, దేవదేవా! నమస్తే నమస్తే నమః.

మ॥ వికలాత్ముండయినన్ విరోధియయినన్ ♦ వీతవ్రతుండైనఁ దా
వకపాదాంబుజభక్తచిత్తుఁడయి సంప్రార్థించెనే నిన్నించుఁజే
సుశీలుండై సుజనాఢ్యుఁడై సుగుణుఁడై ♦ శుద్ధప్రబోధాత్ముఁడై
యకళంకుండయి యాప్తభద్రకరుఁడై ♦ యారాధ్యుఁడై యీశ్వరా!

శంక — మార్కండేయా! అభయహస్తమిచ్చితిని లెమ్ము! నీనిర్మలమును నిశ్చలమును, నిగూఢమును నగు భక్తికి మెచ్చితిని. ఇంక నేమి వరములు వలయునో కోరుము.

మార్కం — దేవా! నా మనోభీష్టంబు మీ కెఱుఁగరానిదా ?

శంక — భక్తాగ్రణీ! కనుఁగొంటివి. నేను నీకుఁ బదునాఱువత్సరంబుల ఆయువుమాత్రమే యిచ్చియుంటి. నామాట నేనే తప్పరాదు. కాన నీవు చిరకాలము షోడశవర్షమాత్ర వయోవంతుఁడవై వృద్ధిక్షయములు లేక నా భక్తవశ్యుండవై మనుచుండుము. ఇంకేమైన వలయునా ?

మార్కం — ఇంకయు నా కేమి వలయును ?

శా॥ నీకైంకర్య మొనర్చునట్టి కరముల్ ♦ నిన్గాంచునేత్రంబులున్
నీ కగ్రాంతము మ్రొక్కునట్టిశిరమున్ ♦ నిన్నెంచుజిహ్వాగ్రమున్
నీకావ్యంబుల నాలకించుచెవులున్ ♦ నీసేవపై బుద్ధులున్
సాకల్యంబుగఁ గూర్చినాఁడ వికఁ నా ♦ శాస్యంబు వేఱుండునే?

(నారదుఁడు సరభసమునఁ బ్రవేశించి నమస్కరించి)

నార — గంగాధరా! కైలాసవాసా! ధన్యుండనైతిని, ధన్యుండనైతిని.

సీ॥ అభ్రభగంగాజూట! ♦ ఆగమోత్తమఘోట!
చతురాననశిరోట ♦ శరణుశరణు
సర్వలోకస్తుత్య! ♦ సంపోషితాదిత్య!
సంగ్రామహృతదైత్య! ♦ శరణుశరణు
మేరుభూభృచ్చాప! ♦ మృత్యుంజదాటోప!
సర్వోపగతరూప! ♦ శరణుశరణు
అఘశైమిస్రపతంగ! ♦ అమలకృపాపాంగ!
శాంకరీహృద్భృంగ! ♦ శరణుశరణు
శర్వరీనాయకోత్తంస! ♦ శరణుశరణు
సజ్జన మనోధ్వగరిరంస! ♦ శరణుశరణు
సర్వశాత్రవవిధ్వంస! ♦ శరణుశరణు
సర్వభూభారభగణాంస! ♦ శరణుశరణు!

శంక — నారదా! నీభక్తికి మెచ్చితిని నీవు చేసినకృషిచే నాభక్త వాత్సల్యము లోకము నందుఁ జూటఁబడియె. యమునిశివద్వేషంబును బ్రిదిలిపోయెను ఇష్టే కారణభూతుఁడవై దైవ కార్యంబులఁ జక్కఁబెట్టి కీర్తిగాంచుము. నీ కేమివరము గావలయునో కోరుము

నార — దేవా! నాకుఁ గావలసినవర మీయముని పునరుజ్జీవనమే! ఈతండు బ్రతుకకున్న లోకము చీకాకై పోవు. భూదేవి పాప భారము వహింపలేక నశించు. కావున నీతని నుజ్జీవింపఁజేయుఁడు.

మార్కం — దేవా! నా ప్రార్థనయు నింతియ.

శంక — భక్తులారా! అట్లే కానిండు. శమనా! లెమ్ము.

యము — (లేచి కన్నుల నలుపుకొని చేతులఁ జోడించి) మాం పాహి, మాం పాహి!

శా॥ నీ మాహాత్మ్య మెఱుంగ నేరక మదాంధీభూతచిత్తుండనై
సామాన్యుబలె ని న్దలంచుచుఁ, దిరస్కారంబుఁగావించి, నీ
ప్రేమఁగన్న మృకండునందనుని గారింపంగ నూకొంటి దేవా!
మన్నింపుము నా ప్రమాదముల నీవాత్సల్య మేపారఁగన్.

శంక—శమనా! మన్నించితిని లెమ్ము. ఇఁక నెప్పటికి శివదూషణ మొనర్పక శివభక్తులజోలికిఁ బోక సుఖంబుగా మనుము.

యము—దేవా! అట్లే యొనర్చెద. (నిష్క్రమింప శివుం డంతర్ధాన మగును.)

మార్కం—మునీంద్రా! పరమేశ్వరుండు తిరోహితుం డయ్యె. ఇఁకఁ గర్తవ్య మేమి?

నార—భక్తాగ్రణీ! ఇఁక మీ తల్లిదండ్రులు నీ కేమైనదో యని భయ పడుచుందురు. వారలదండ కేఁగి నీముఖారవింద దర్శనంబునఁ బరితోషిత చిత్తులం జేయుము.

మార్కం—మునీంద్రా! అట్లే యొనర్చెద. అయిన నిట్లగుఁగాక!

—♦ భ ర త వా క్య ము ♦—

ఉ॥ కర్మము కర్మమంచు మఱి ♦ కాంచన గర్భనివాత యంచు దు
ష్కర్మలుగాఁ జరింపక త్రి♦కాలములం దతిభక్తితోఁ గరీ
చర్మకృతోత్తరీయుకృప ♦ సర్వముఁ గాంచఁగనచ్చు నన్న యీ
మర్మ మెఱింగి వర్ధిలుత ♦ మానవ బృంద మసౌఖ్యదూరమై.

భక్తమార్కండేయ నాటకము

సర్వంబును సమాప్తము.



కం॥ పాత్రుండగు కౌండిన్యస
గోత్రుం డగు ముత్తరాజు ♦ కులకమలవనీ
మిత్రుం డగు సుబ్బార్యుని
పుత్రుం డగు సుబ్బారావు ♦ పొనరిచె దీనిన్.



# ప్రకటన

మాకు సర్వహక్కులు కలిగిన ప్రఖ్యాత రచయితలచే వ్రాయబడి పేరుగాంచిన స్టేజినాటకములు, కథలు, చరిత్రలు, నవలలు, స్క్రీనుకు ఉపయోగించే అనేక ప్రఖ్యాత గ్రంథములు కలవు. కాపీరైటు యాక్టుప్రకారము మా అనుమతి లేనిదే ఏ రచనల నైననూ, ఎవ్వరూ, ఏవిధముగా వుపయోగించుకొన్ననూ, వారిపై నేను జరుపు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందు మూలముగా తెలియ జేయడమైనది.

శ్రీకృష్ణతులాభారం, చింతామణి, మధుసేన, రంగూన్‌రౌడి, ధరణికోట, సతీసక్కుబాయి, ద్రౌపదీవస్త్రాపహరణం, కురుక్షేత్రం, (ద్రౌపది), విప్రనారాయణ, చండిక, ఢిల్లీరాజ్యపతనం, (ప్రతీకారం), కోకిల, పాదుకా పట్టాభిషేకం, చంద్రగుప్త ఈ నాటకములలో ఏనాటకమయినను, నాటక భాగమైనను మా పర్మిషన్ లేకుండా ప్రదర్శించరాదు. నాటకమునకు ముందుగా పర్మిషన్ ఫీజు చెల్లించి రసీదుపొంది ప్రదర్శించవలెను. అట్లు పర్మిషన్ పొందకుండా ప్రదర్శించువారిపై మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని హెచ్చరిక.

మావద్ద లైబ్రరీలకు, నర్తకులకు, సాహిత్యాభిమానులకు, స్కూలు గ్రంథాలయములకు, డిస్ట్రిక్టుబోర్డు, సెంట్రల్ లైబ్రరీలకు న్యూస్ ఏజంట్లకు మొదలగువారికి పనికివచ్చు అన్ని రకముల గ్రంథములు కలవు. భారీగా ఆర్డరుయిచ్చు వారికి మంచికమీషను యివ్వబడును. కోరిన వెంటనే కేటలాగు పంపబడును.

**కురుకూరి స్వరాజ్య వెంకటసత్యనారాయణరావు**

సరస్వతీ బుక్ డిపో ప్రొప్రయిటర్.

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1**